# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# త్వరపడండి! త్వరపడండి!

## చివరి అవకాశం; గెలవండి

# రూ. 10,000 బహుమతులు

రెండు మొదటి బహుమతులు
ఒక్కొక్కటి రూ. 2,500 విలువగలవి
రెండు 2వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 1,000 విలువగలవి
రెండు 3వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 500 విలువగలవి
రెండు 4వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 100 విలువగలవి
36 కాన్సొలేషన్ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 50 విలువగలవి

మీ ఉత్తమ ఫోటోను 31 డిసెంబరు, 1967 లోపు పంపించండి.
... అది ప్రక్క వాటిలో ఏదో ఒక బహుమతి మీకు సంపాదించి పెట్టవచ్చు:

## Agfa క్లిక్ III




మీ దగ్గర క్లిక్ III ఉంటే, యీ రోజే క్లిక్ చేయడం ప్రారంభించండి. లేకపోతే, వెంటనే క్లిక్ III ఒకటి కొని, యీ గొప్ప ఫోటో పోటీలో ప్రవేశించండి. ప్రవేశపత్రాలు మీకు దగ్గరలోనున్న అగ్ఫా-గేవర్ట్ డీలరు దగ్గర లభిస్తాయి: లేదా మాకు వ్రాయండి: కాంపెటిషన్ డిపార్ట్‌మెంట్, అగ్ఫా-గేవర్ట్ ఇండియా లిమిటెడ్, కస్తూరీ బిల్డింగ్, జె. టాటా రోడ్, బొంబాయి-1. అగ్ఫా క్లిక్ III-అంతర్జాతీయ ప్రసిద్ధికెక్కిన, విశ్వసనీయమైన కెమెరా. క్లిక్ చటుక్కున పని చేస్తుంది-గుండిపెట్టి నొక్కడమే. అది చాల ఖోడిమిగలది. 12 పెద్ద (6X6 సెం.మీ.) ఫోటోలు ప్రతి రోలుఫిల్ము మీద తీస్తుంది. అనంత తృప్తికోసం క్లిక్ IIIనే కొనండి. దాని ఖరీదు రూ. 46.50 మాత్రమే. (స్థానిక పన్నులు అదనం)



ఈ రోజే క్లిక్ చేయడం మొదలుపెట్టండి. మీ ప్రవేశ ఫోటోలను 31 డిసెంబరు, 1967 లోపున పంపండి.
అగ్ఫా-గేవర్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి., న్యూఢిల్లీ . కలకత్తా., మద్రాసు.

CMAG-98-203 TL



# తాను తన కొడుకును గ్రామానికి అంతటికీ తొలి ఎలెక్ట్రోనిక్స్ ఇంజనీరుగా చేసాడు

—అయితే తాను మాత్రం చదువనూ వ్రాయనూ చేయలేడు



అయితే తాను పొదుపు చేసాడు. చాలా ఏళ్ల క్రితం—బ్యాంక్ అఫ్ బరోడాలో సేవింగ్స్ అక్కౌంటు ప్రారంభించాడు. తన కొడుకు పెరిగాక—అతనికి చదువు చెప్పించడానికి తగ్గ డబ్బు తనదగ్గర వుంది. ఈ నాడు అతనొక సగర్విఅయిన తండ్రి—అతని కొడుకు ఎలెక్ట్రోనిక్స్ యింజనీరంటే గ్రామానికంతటికీ గర్వం.

బ్యాంక్ అఫ్ బరోడా—మీ స్వప్నాలను కూడా సార్థకం చేయడంలో మీకు సహాయపడగలదు. నేడే బ్యాంక్ అఫ్ బరోడాలో సేవింగ్స్ ఎక్కౌంటు తెరవండి. రూ. 1తో ఎకౌంటు తెరవచ్చు. 4% వడ్డీ దొరుకుతుంది.

సర్వదా—సమృద్ధికి సోపానం




## ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్

(స్థాపితం 1908) రిజిస్టర్డ్ ఆఫీసు : మాండ్వి, బరోడా.
భారతదేశంలో విదేశాలలో 300 కంటె హెచ్చు శాఖలు
"దయచేయండి మీకు సాయపడతాం" అనే కరపత్రం ఉచిత కాపీని కోరండి. మా సేవల గురించి మీకు పూర్తి వివరాలు దొరుకుతాయి.

Shilpi/bob/3-67 Tel



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో "నెల జీతం" అన్న చిన్న హాస్యకథలో పెద్ద నీతి ఉన్నది. ఈ లోకంలో వంచకులు కొందరు తాము కొన్ని నియమాలకు కట్టుబడి నట్టు నటిస్తారు. ఈ నియమాలు ఇతరులను మోసగించటానికే గాని మరెందుకూ కాదు.

ఈ సంచికతో "పాతాళ దుర్గం" రంగుల బొమ్మల కథ పూర్తి అవుతున్నది. పై సంచిక నుంచి మరొక కొత్త సీరియల్ ప్రారంభమవుతుంది. దానికై ఎదురు చూడండి.

సంపుటి 41 డిసెంబర్ '67 సంచిక 6

CHITRA



# భారత చరిత్ర



పానిపట్టు యుద్ధంలో తిన్న దెబ్బ నుంచి మహారాష్ట్రులు 1770 నాటికి పూర్తిగా కోలు కున్నారు. ఢిల్లీ చక్రవర్తి అయిన రెండవ షా ఆలం వారికి అధీనుడయాడు. మహా రాష్ట్రులను కొంత అదుపులో ఉంచడం కూడా ఒక ఆశయంగా పెట్టుకుని వారన్ హేస్టింగ్స్ 1773 లో వారాణసి సంధి చేసు కున్నాడు. అయితే ఈ లోపుగానే మహా రాష్ట్రులకు తీరని నష్టం సంభవించింది— 1772 లో పేష్వా మాధవరావు చని పోయాడు. మాధవరావు పినతండ్రి అయిన రఘునాథరావుకు అంతులేని అధికార వ్యామోహం పట్టుకున్నది; మాధవరావుకు తమ్ముడూ, వారసుడూ అయిన నారాయణ రావు బొత్తిగా దుర్బలుడు. పేష్వా మాధవ రావు తన పినతండ్రి రఘునాధరావు (రఘోబా)ను నిగ్రహించి ఉంచగలిగాడు. కాని యువకుడైన నారాయణరావు చిలిపి తనం కొద్దీ రఘోబాతో వైరం పెట్టుకుని, అతన్ని నిర్బంధంలో ఉంచాడు. దీనితో రఘోబా రెచ్చిపోయి, అసంతృప్తులై ఉన్న కొందరు సైనికులతో కుట్ర చేశాడు. 1773 ఆగస్టు 30 న నారాయణరావు తన పిన తండ్రి సమక్షంలోనే హత్య చేయబడ్డాడు.

తరవాత రఘోబా పేష్వా అయాడు. కాని త్వరలోనే అతనికి ప్రతిఘటన ఏర్ప డింది. పూనాలోని ఒక బలమైన వర్గం, నానా ఫడ్నవిస్ అనే బ్రాహ్మణయువకుడి నాయకత్వం కింద రఘోబాను వ్యతిరేకిం చింది. చనిపోయిన నారాయణరావు భార్య గంగాబాయి 1774 లో ఒక మగ శిశువును ప్రసవించటం ప్రతిపక్షులకు బలాన్ని చేకూర్చింది. వారు ఆ పసికందును పేష్వాగా ప్రకటించారు.

రఘోబా ఆట కట్టయింది. అతన్ని దేశాంతరాలకు తరిమివేశారు. అతను

బొంబాయిలో ఉన్న ఇంగ్లీషు వారిని శరణు జొచ్చి, వారి సహాయం అర్థించాడు. ఇంకేం? భారతీయుల మధ్య అంత ర్వైరాలు ఇంగ్లీషు వారికి ఎప్పుడూ లాభి స్తూనే వచ్చాయి. ఈసారీ అంతే అయింది. నిజానికి, బొంబాయిలోని ఇంగ్లీషువారు పూనాలోని మహారాష్ట్ర ప్రభుత్వంతో సత్సం బంధాలు కలిగి ఉన్నారు; అయితే బొంబాయి పరిసరాలలో ఉన్న తీర ప్రాంతాలు తమ అధీనమైతే తమకు మరింత బలం చేకూరు తుందన్న ఆశతో వారు రఘోబా పక్షం అవలంబించారు. 1775 మార్చి 7 న రఘోబాకూ, ఇంగ్లీషు వారికీ సురాత్ ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ప్రకారం ఇంగ్లీషువారు రఘోబాకు 2,500 మంది సైనికుల నివ్వటానికీ, వారి ఖర్చులు అతనే భరించటానికీ ఏర్పాటు జరిగింది. ఇందుకు ప్రతిఫలంగా రఘోబా సాల్సెట్, బస్సీన్‌లను ఇంగ్లీషువారి పరం చేశాడు; భరూచ్, సురాత్ జిల్లాలపై రాబడిలో కొంత వారి కివ్వడానికి అంగీకరించాడు; కంపెనీ విరోధులతో మైత్రి చేసుకోకుండా ఉండడానికీ, ఎవరితో మైత్రి చేసుకున్నా ఆ ఒడంబడికలో ఇంగ్లీషువారిని కూడా చేర్చటానికీ ఒప్పుకున్నాడు. 1775 ఫిబ్రవరి 27 నాటికి కర్నల్ కీటింగ్ అనే



వాడి నాయకత్వాన బ్రిటిషు సైన్యం కొంత సురాత్ చేరింది. మే 18 న అరాస్ మైదానం మీద, కీటింగ్, రఘోబాల సమిష్టి సేనలు పూనా ప్రభుత్వసేనలను తలపడి యుద్ధం చేసి ఓడించాయి.

అయితే బొంబాయి ప్రభుత్వం ఇలా రఘోబాతో ఒప్పదం చేసుకోవడానికీ, యుద్ధం చెయ్యడానికీ కలకత్తాలోని సుప్రీమ్ కౌన్సిలు అనుమతి లేదు. సురాత్ ఒప్పం దాన్ని ఆమోదించడానికి వారన్ హేస్టింగ్స్ సిద్ధంగానే ఉన్నప్పటికీ, సుప్రీమ్ కౌన్సిలు సభ్యులలో అధిక సంఖ్యాకులు ఒప్పం దానికి అభ్యంతరం చెప్పారు. బొంబాయి

కౌన్సిలు వారి చర్య "అవివేకమూ, అపాయకరమూ, అనధికారికమూ, అక్రమమూ" అయినదని కలకత్తా కౌన్సిలు తీర్మానించింది.

కొద్ది మాసాల అనంతరం, కలకత్తా నుంచి కర్నల్ అప్టన్ అనేవాడు పూనాకు వచ్చి అక్కడి ప్రభుత్వంతో సంధి సంప్రతింపులు జరిపాడు. 1776 మార్చి 1 న పురంధర్ ఒడంబడిక జరిగింది. దీనితో సూరత్ ఒప్పందం రద్దవుతుంది. కొత్త ఒప్పందం కింద సాల్సెట్, బస్సీనులు ఇంగ్లీషువారికే చెందుతాయి. ఇంగ్లీషువారి యుద్ధ ఖర్చుల కింద పూనా ప్రభుత్వం 12 లక్షల రూపాయలిచ్చుకోవాలి; ఇంగ్లీషువారు రఘోబా పొత్తు వదులుకోవాలి; అతను వెళ్ళిపోయి గుజరాతులోని కోపర్‌గాంవ్‌లో నివాసం ఏర్పరచుకోవాలి; అతనికి పూనా ప్రభుత్వం నెలకు 25,000 రూపాయలు భరణం ఇస్తుంది.

అయితే ఈ ఒప్పందం అమలు జరగలేదు. ఇందులోని నిబంధనలు బొంబాయి ప్రభుత్వానికి నచ్చలేదు. వారు ఈ ఒప్పందాన్ని ధిక్కరించి, అప్టన్ మాటలు పెడచెవిని బెట్టి, రఘోబాకు ఆశ్రయమిచ్చారు. పూనా ప్రభుత్వం కూడా ఒప్పందంలోని నిబంధనలను అమలు జరపలేదు. 1777 లో నానా ఫడ్నవిస్ ఒక ఫ్రెంచివాణ్ణి చేరదీసి, ఫ్రెంచివారికి పశ్చిమ తీరంలో ఒక రేవు ఇస్తానని మాట ఇచ్చాడు. ఇందువల్ల బొంబాయి కౌన్సిలు వారికి ఫ్రెంచివారి ఎత్తుగడలను గురించి సందేహాలు తలఎత్తాయి. ఇంగ్లీషువారు తిరిగి యుద్ధం తలపెట్టి, 1778 నవంబరులో పూనా మీదికి 600 మంది తెల్ల సైనికులనూ, 3,300 మంది సిపాయీలనూ పంపారు. 1779 జనవరి 9 న పడమటి కనుమలలోని తాలేగాంవ్ వద్ద పెద్ద మరాఠీ సేన ఈ సేనను ప్రతిఘటించి, చిత్తుగా ఓడించింది.





# నాగరాజు శాపం

ఒక గ్రామంలో ఒక సంపన్నుడుండేవాడు. ఆయన అకాలమరణం చెందటంవల్ల ఆయన భార్యా, కుమార్తే మగదిక్కు లేని వారయారు. అయితే గ్రామాధికారి వారికి కొంతవరకు అండగా ఉంటూ వచ్చాడు. ఆయన మీద ఆధారపడి తల్లి కూతుళ్ళు జీవయాత్ర గడుపుతూ వచ్చారు. కూతురు వసంతకు పెళ్ళియీడు వచ్చింది. తన కూతురికి తగిన సంబంధం ఎలా తీసుకు రావటమా అన్న విచారం తల్లికి పట్టు కున్నది. వసంత చాలా గొప్ప సౌందర్య వతి అయింది. ఆమె అందం చూసి రాజ కుమారులు సైతం మోహించి పెళ్ళాడ వచ్చు. కాని దిక్కు లేని తల్లి వసంతకు ఏ రాజకుమారుణ్ణి తీసుకురాగలదు?

అన్నిటికీ గ్రామాధికారే దిక్కు కావటం చేత తల్లి ఒకసారి ఆ గ్రామాధికారితో తన కూతురి పెళ్ళి విషయం ప్రస్తావించింది.

"వసంత పెళ్ళి విషయం నీ కేమీ విచారం వద్దు. ఆ పిల్లను నేనే పెళ్ళాడ తాను. ఆ ఉద్దేశంతోనే కదా ఇంతకాలమూ మీ బరువంతా నేను మోసింది?" అన్నాడు గ్రామాధికారి.

ఈ మాట వినగానే తల్లికి ప్రాణం చచ్చినట్టయింది. గ్రామాధికారికి అప్పటికే ముగ్గురు పెళ్ళాలున్నారు. నడి వయస్సు కూడా దాటిపోయినవాడు. కాకిముక్కుకు దొండపండు కట్టినట్టు, వసంతను ఆ ముసలివాడికి నాలుగో పెళ్ళాంగా ఎలా కట్టబెట్టటం?

గ్రామాధికారి వసంతను పెళ్ళాడాలని నిశ్చయించుకుంటే అలా జరగకుండా చేసే శక్తి గ్రామంలో ఎవరికీ లేదు. పైగా తాను దిక్కు లేనిది. ఈ స్థితిలో తనకు ఎవరూ సహాయం రారు. ఈ మాట తెలుసుకుని ఒకనాటి అర్ధరాత్రివేళ తల్లి వసంతను

బి. శేషావతారం



వెంటబెట్టుకుని, అవసరమైన వస్తువులన్నీ రెండు మూటలు కట్టి, ఊరు విడిచి అరణ్యమార్గం పట్టి బయలుదేరింది.

పోగాపోగా అరణ్యంలో ఒక పాతకాలపు దేవాలయం కనపడింది. తల్లి కూతుళ్ళు అందులో కాస్సేపు విశ్రాంతి తీసుకుందామనుకున్నారు. ఆలయం పక్కనే ఒక పొద ఉన్నది. దాని నిండా మంచి సువాసన గల పుష్పాలున్నాయి. వసంత ఆ పూలను కోసుకుందామని పొదను సమీపించేటప్పుడు అందులో నుంచి ఒక పాముపిల్ల బయటికి వచ్చింది. వెంటనే తల్లి ఒక రాయిపెట్టి దాన్ని చంపేసింది.

వసంత కొన్ని పూలు కోసి తలలో పెట్టుకుంటూ, "అయ్యో ఆ పాముపిల్ల నెందుకు చంపావమ్మా?" అన్నది.

"పిల్ల అయినా విషపు జంతువు గదా అని చంపానే!" అన్నది తల్లి.

వసంత తన మూట ఎత్తుకుని గబగబా గుడిలోకి వెళ్ళిపోయింది. తల్లి తన మూట కూడా తీసుకుని వెనకగా గుడిలోకి ప్రవేశించింది. కాని గుడిలోపల వసంత లేదు. ఆమె వెంట ఉండిన మూట మాత్రం ఉన్నది. గుడిలో అయిదు తలల నాగదేవత శిలావిగ్రహం ఉన్నది. వసంత దాని చాటున ఉన్నదేమోనని తల్లి విగ్రహం వెనక్కుపోయి చూసింది. కాని వసంత అద్భుతంగా అదృశ్యమైపోయింది.

"అమ్మాయి, వసంతా!" అని తల్లి రెండు మూడుసార్లు కేకపెట్టింది.

జవాబు లేదు. నాగదేవత విగ్రహం నుంచి ఇలా మాటలు వినిపించాయి:

"నువు నా బిడ్డ ప్రాణాలు తీశావు. నేను నీ బిడ్డను మాయం చేశాను."

తల్లికి దుర్భరమైన పశ్చాత్తాపమూ, ఆవేదనా పుట్టుకొచ్చాయి. ఏ కూతురి కోసమైతే తాను పడరానిపాట్లన్నీ పడ్డదో ఆ కూతుర్ని తానే చేతులారా పోగొట్టుకున్నది!

ఆమె నాగదేవత ముందు సాష్టాంగపడి, "నాగరాజా, తండ్రీ! నేను తెలీక చేసిన అపచారానికి నా బిడ్డను శిక్షించకు! కావలిస్తే నా ప్రాణాలు తీసుకో! నా బిడ్డను కాపాడు!" అని మళ్ళీ మళ్ళీ, ఏడుస్తూ ప్రార్థన చేసింది.

"నీ బిడ్డ అదృశ్యమయింది గాని చావలేదు. నా ఆలయం పక్కగా వెళ్ళే మగవాళ్ళను నీ కూతురు మూడేసిసార్లు పిలుస్తుంది. అలా మూడు పిలుపులూ విని లోపలికి వచ్చినవాడు ఆమెకు తిరిగి ఆకారం ఇచ్చి, ఆమెను పెళ్ళి కూడా చేసుకుంటాడు," అన్న మాటలు నాగదేవత విగ్రహం నుంచి వినిపించాయి.

ఆ తరవాత ఆమె రెండు పూటలా నాగరాజును ధ్యానం చేసేది. మిగతా సమయాలలో ఆలయం వెలపల ఒక చెట్టు కింద కూర్చునేది. చెట్ల మీద కాసే కాయలూ, పళ్ళూ తిని పొట్టపోసుకునేది.

ఒకరోజు ఒక కట్టెలు కొట్టేవాడు అటు పక్కగా వచ్చాడు. ఆలయం లోపలి నుంచి, "అయ్యా, ఒకసారి లోపలికి రా!" అని వసంత కంఠం పిలిచింది. కట్టెలు కొట్టేవాడు గుడిలోపలికి వెళ్ళి, మళ్ళీ బయటికి వచ్చి, "ఎవరూలేరే! ఏమిటి చిత్రం!" అని తనలో తాను అనుకుంటున్నట్టుగా పైకి అనేశాడు.



"ఎవరూ లేకపోవటమేమిటి, నాయనా? అందులో ఒక మోహినీ పిశాచి ఉన్నది," అన్నది తల్లి.

ఇంతలో మళ్ళీ వసంత గొంతు, "అయ్యా, ఒకసారి లోపలికి రా!" అని పిలిచింది. కట్టెలు కొట్టేవాడు బెదిరిపోయి పారిపోయాడు.

ఇలాగే ఆటవికులూ, దొంగలూ ఆ గుడి పక్కగా వచ్చేవాళ్ళు. అటుగా ఏ మగవాడు వచ్చినా గుడిలో నుంచి పిలుపు వినపడేది. వాళ్ళను తల్లి బెదరగొట్టి పంపేసేది.

కొన్ని రోజులు గడిచాక అటుగా ఒక రాజకుమారుడు వచ్చాడు. అతనికి కూడా వసంత పిలుపు వినిపించింది. అతను లోపలికి వెళ్ళి, అక్కడ ఎవరూ లేక పోవటం చూసి, గుడిచుట్టూ తిరిగి చూశాడు. ఇంతలో మళ్ళీ వసంత పిలుపు రెండోసారి వినిపించింది. అతను మళ్ళీ లోపలికి వెళ్ళి చూశాడు. లోపల ఎవరూ లేరు. అతను మళ్ళీ బయటికి వచ్చి, బయట కూర్చుని అంతా చూస్తున్న తల్లిని, "ఎవరా పిలిచేది ?" అని అడిగాడు.

"నే నేమీ వినలేదు, నాయనా !" అన్నది తల్లి.

ఇంతలో వసంత మూడోసారి పిలిచింది. రాజకుమారుడు మూడోసారి ఆలయంలోకి వెళ్ళాడు. అతని వెంటనే తల్లి కూడా వెళ్ళింది. ఈసారి లోపల వసంత కనిపించింది. ఆమె స్పృహలేనట్టుగా నాగదేవత విగ్రహం ముందు పడిఉన్నది.

రాజకుమారుడు చప్పున ఆమెను లేపి కూర్చోబెట్టి, శైత్యోపచారాలు చేశాడు. కొంత సేపటికి వసంత కళ్ళు తెరిచి, ఎవరో పరాయివాణ్ణి చూసి సిగ్గు పడింది. ఇంతలో ఆమెకు తన తల్లి కనిపించింది. ఆమె "అమ్మా !" అంటూ లేచివచ్చి తన తల్లిని కౌగలించుకున్నది.

తరవాత తల్లి రాజకుమారుడితో, "నాయనా, నీ రుణం ఎట్లా తీర్చుకోగలను ? నా కూతుర్ని నాకు తిరిగి దానం చేశావు !" అంటూ తమ కథ అంతా అతనికి చెప్పింది.

అంతా విని రాజకుమారుడు, "నేను మీకు పుత్రికాదానం చేశాను. మీరు నాకు మీ అమ్మాయిని కన్యాదానం చెయ్యండి," అని అడిగాడు.

తరవాత ఆ తల్లి కూతుళ్ళు ఆ రాజకుమారుడి వెంట అతని నగరానికి వెళ్ళి పోయారు. అక్కడ వసంతను రాజకుమారుడు మహావైభవంగా పెళ్ళి చేసుకున్నాడు.





# పాతాళదుర్గం

## 20

[రాక్షసులు నల్లగరుడపక్షికి ప్రాణాచారాలు పడుతున్న అదనులో, మాంత్రికుడు కొండ మీది సరోవరజలం పాతాళదుర్గం మీద ప్రవహించేలా చేశాడు. నీటమునిగి చాలామంది రాక్షసులు చచ్చారు. మిగిలిన వాళ్ళతో మహాకలి సొరంగమార్గం కేసి బయలుదేరాడు. దాన్ని శశికాంతుడూ, కుంభీరుడూ తమ అనుచరులతో కావిలి కాస్తున్నారు. తరవాత—]

కాలశంబర మాంత్రికుడు సొరంగ మార్గం పైభాగానికి చేరుతూనే కుంభీరుణ్ణి హెచ్చరిస్తూ, "కుంభీరా! నువ్వు పాతాళ దుర్గం రాజువయే క్షణం సమీపిస్తున్నది. నీ రాహువంశం వాళ్ళు దండకారణ్యాన్ని హాయిగా ఏలుకోవచ్చు. కేతువంశం వాళ్ళు సర్వనాశనం అవుతున్నారు," అన్నాడు.

మాంత్రికుడు మాట ముగించే లోపలే ధూమకుడు అతడి భుజం పట్టుకుని వెనక్కు తిప్పుతూ, "మహాకలి సొరంగ మార్గాన్ని సమీపిస్తున్నాడు," అని చెప్పాడు.

"వాడి ప్రయత్నమేమిటో నాకు తెలుసు. ఊం, రానివ్వండి. అందుబాటు లోకి రాగానే వాళ్ళ మీద, యీ రక్కసిబండలను తోయండి," అన్నాడు కాలశంబరుడు.

మాంత్రికుడిలా చెపుతున్నంతలో మహాకలీ, ఆతడి అనుచరులూ సొరంగ ద్వారం వున్న ప్రాంతం చేరారు.



"జై, కుంభపతీ!" అంటూ మహాకలి తన చేతనున్న గదతో ఏనుగు తల మీద చిన్నగా కొట్టాడు. వెంటనే ఏనుగు నీళ్ళల్లో మునిగింది. దానితోపాటు అతడి అంగరక్షకు లిద్దరూ ఎక్కివున్న ఏనుగు కూడా మునిగింది. వెంటనే ఫెళఫెళమంటూ పెద్ద ధ్వని అయింది. మాంత్రికుడూ, అతడి అనుచరులూ ఆ ధ్వని వచ్చిన వైపుకు వెళ్ళి చూసేంతలో, మహాకలి సారంగ మార్గానికి అడ్డుగా వున్న రాళ్ళను ఏనుగుతో పడదోయించి బయిటికి వచ్చేశాడు. అతడి వెనకగా, అంగరక్షకు లెక్కివున్న ఏనుగూ బయటపడింది. మరుక్షణంలో సారంగ మార్గాన్నుంచి నీరు పెద్ద శబ్దం చేస్తూ వేగంగా బయిటికి ప్రవహించసాగింది.

కుంభీరుడూ, అతడి బంధువర్గం పట్టుకునివున్న పులులూ, సింహాలూ ఆ నీటిని చూసి బెదిరిపోయినై. వాళ్ళు వాటిని అదుపు చేయబోయేంతలో మహాకలి వాళ్ళను చూసి, "కుంభీరా! నువ్విక్కడ ఏం చేస్తున్నావ్? ద్రోహీ, నువ్వేగదా సారంగ మార్గానికి రాళ్ళు అడ్డం పెట్టించింది?" అంటూ అరిచి ఏనుగును అతడి మీదికి దూకించాడు.

కుంభీరుడు యిలాంటి ప్రమాదం రానున్నదని ముందే వూహించి వుండటంతో, చప్పున తన దగ్గిరున్న సింహాన్ని మహాకలి ఎక్కివున్న ఏనుగు మీదికి ఉసిగొలిపి, దూరంగా పరిగెత్తి, "రాహువంశానికీ, జై!" అంటూ తన చేతులోవున్న శూలాన్ని మహాకలికి గురిచేసి బలంగా విసిరాడు. కాని, అది గురితప్పి ఏనుగు డొక్కలో గుచ్చుకున్నది. దానితో అది బెదిరిపోయి, మహాకలి ఆపాలని ప్రయత్నించినా ఆగకుండా, ఘీంకరిస్తూ అరణ్యం కేసి పరిగెత్తసాగింది. మహాకలి అంగరక్షకులు తమ నాయకుణ్ణి అనుసరించారు. కుంభీరుడు తన అనుచరులను హెచ్చరించి, సింహాన్ని తీసుకుని



మహాకలి వెంటబడ్డాడు. కాని, యీలోపలే శశికాంతుడు, మహాకలి దారిని అడ్డగిస్తూ, అతడి మీద బాణాలు ప్రయోగించసాగాడు.

కాలశంబర మాంత్రికుడు, "శాంభవీ!" అంటూ పెద్దగా అరిచి, "ఆ దుర్మార్గుడికి అడ్డుతగలండి. నే నొస్తున్నాను!" అంటూ సారంగం మీది నుంచి ఉప్పించి దూకుతూ కిందికి దిగి, మహాకలి కేసి పరిగెత్తాడు. ధూమకుడూ, సోమకుడూ, భద్రుడూ కూడా మాంత్రికుడి వెంట పరిగెత్తారు.

సారంగద్వారం నుంచి ప్రవాహం వెంట బయిటికి కొట్టుకువచ్చిన కొందరు రాక్షసులను, కుంభీరుడి అనుచరులు తేలికగా చంపేశారు. వాళ్ళు నీటపడి యీది యీది సగం చచ్చివుండటంతో, వాళ్ళు అంతగా ప్రతిఘటించలేక పోయారు. పులులూ, సింహాలూ వాళ్ళ మీదికి దూకి, కంఠాలను గావుపట్టు పట్టినై.

పరిస్థితి విషమించిందని తెలుసుకున్న మహాకలి, నిలిచి పోరాడటంకన్న, పారి పోవటమే క్షేమం అనుకున్నాడు. కాని, కాలశంబరుడు తనవాళ్ళందర్నీ, అతడు అరణ్యం లోకి పారిపోకుండా దారి అటకాయించమన్నాడు. "కావాలంటే వాణ్ణి కొండల కేసి పోనివ్వండి. అంతేగాని




అరణ్యంలోకి ఒక సారి జొరపడ్డాడో యిక మనకు కనబడడు," అని హెచ్చరించాడు.

మహాకలీ, అతడి అనుచరు లిద్దరూ అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టబడ్డారు. అరణ్య మార్గం వైపున కుంభీరుడూ అతని అనుచరులూ చేరి అతడి మీదికి రాళ్ళూ, పెద్దపెద్ద చెట్లకొమ్మలూ విసరసాగారు. మరో వైపు నుంచి శశికాంతుడూ, సోమకుడూ వాళ్ళ మీద బాణాలు ప్రయోగిస్తున్నారు. ధూమకుడు మరిద్దరు అనుచరులతో రాకుమారి కాంతిసేననూ, భామాసింగినీ ఆ ప్రదేశం నుంచి రక్షణ కోసం కొంత దూరంగా తీసుకుపోయాడు.




మహాకలి తన ఏనుగును శత్రువుల మీదికి వురికిస్తూ, అందినవాళ్ళను గదతో మోదుతూ కొంతసేపు పోరాడి, ఇక లాభం లేదని తెలుసుకుని, తన అంగరక్షకులను హెచ్చరించి, దాన్ని శశికాంతుడి కేసి దూకించాడు. శశికాంతుడు బాణాలతో ఏనుగును అడ్డగించలేకపోయాడు. మహాకలి యీ విధంగా శత్రువలయాన్ని ఛేదించుకుని, కొండల కేసి పారిపోసాగాడు. అతడి అంగరక్షకులు అతడికి వెనకగా తమ ఏనుగును ఉరికించారు.

ఏనుగుతో దారి మార్గం లేని కొండ ఎక్కటం సాధ్యంకాదని తెలిసిన మహాకలి, ఆ కొండలో తాను ఏనుగుతో కూడా ప్రవేశించటానికి అనువైన గుహ కోసం వెతికి, అలాంటి దొకటి కనిపించగానే, ఆగి, వెనక వస్తున్న అంగరక్షకులతో, "శత్రువుల నుంచి మనం చాలా దూరం వచ్చేశాం. మనం దాగబోయే గుహ వాళ్ళు కనుక్కోలేరు. అదుగో, ఆ ఎదురుగా కనిపించే గుహలోకి నే వెళ్తాను. మీరు యీ దాపులనే ఏదైనా గుహలో దాగండి," అంటూ గుహలోకి ప్రవేశించాడు.

మహాకలి అంగరక్షకులు తమ నాయకుడు గుహ ప్రవేశించగానే, తామెక్కివున్న ఏనుగును అల్లంత దూరంలోవున్న మరొక గుహ దగ్గిరకు తీసుకుపోయి, శత్రువులెవరూ తమను వెన్నాడటంలేదని ధృవపరుచుకునేందుకు ఒకసారి వచ్చిన మార్గం కేసి పరీక్షగా చూసి, తరవాత ఏనుగును మెల్లగా గుహ కేసి నడిపారు. కాని, వాళ్ళు చాలా దురదృష్టవంతులు. ఏనుగును జాగ్రత్తగా వాళ్ళు గుహ ద్వారం దగ్గిరకు తీసుకుపోయి, లోన ప్రవేశించబోయేంతలో, గుహ పైభాగాన్నుంచి, రాతితో చేయబడిన పడవలంగ రొకటి గిరగిరా తిరుగుతూ వచ్చి, వాళ్ళ కంఠాలను బలంగా తాకింది. ఆ దెబ్బకు వాళ్ళిద్దరూ దిమ్మెరపోయి,






కుయ్యిం మనేందుకూ్కడా శక్తిలేక, ఏనుగు మీది నుంచి దభీ మంటూ కింది రాళ్ళమీద పడిపోయారు. ఆ మరుక్షణం పై నుంచి వికటాట్టహాసం వినబడింది. మరి కొన్ని బండరాళ్ళు గుహ పై నుంచి గురిగా వాళ్ళ శిరస్సుల మీద పడినై. అంగరక్షకు లిద్దరూ తలలు పగిలి ప్రాణాలు వదిలారు.

ఆ మరుక్షణం, "రాహు కేతు వంశాలు నశించాలి!" అంటూ పొట్టి రాక్షసుడు, రాళ్ళ చాటు నుంచి లేచి నిలబడి, రాతి లంగరును గాలిలో గిరగిరా తిప్పసాగాడు. అతడి పక్కన, వాడి ఆటవికభార్య వెనక్కు తిరిగి చప్పట్లు చరిచి చేతులూపసాగింది. ఒకటి రెండు నిమిషాలు గడిచినై. కుంతల దేశ మంత్రి గంగాధరుడు కొద్ది పరివారంతో పొట్టి రాక్షసుడి దగ్గిరకు వచ్చాడు. రాక్షసు డాయనకు మహాకలి దాగి వున్న గుహ చూపించి, ఆ ప్రాంతాని కేసి పరుగున వస్తున్న మాంత్రికుడు కాలశంబరుణ్ణీ, అతడి అనుచరుల్నీ తొందరగా రావలసిందని హెచ్చరిస్తూ కేకలు ప్రారంభించాడు.

కొద్ది సేపటిలో మాంత్రికుడూ, శశి కాంతుడూ, కుంభీరుడూ గుహల దగ్గిరకు వచ్చారు. మంత్రి గంగాధరుడు కొండ దిగి వచ్చి, తన కుమారుణ్ణి కౌగలించు కుని, ఆనంద బాష్పాలు రాలుస్తూ, "శశీ! నువ్వు బతికే వున్నావని మొదటి నుంచీ నాకు గట్టి నమ్మకం వున్నది. ఈ పొట్టి రాక్షసుడు మూడు నాలుగు నెలల క్రితం మన రాజ్యం వచ్చి, పాతాళదుర్గాన్ని గురించిన అన్ని రహస్యాలూ చెప్పేశాడు. నేను కొద్దిపాటి సేనతో బయలుదేరి వారం రోజుల క్రితమే యీ ప్రాంతాలు చేరాను. పాతాళదుర్గం సర్వనాశన మవటం కళ్ళారా చూశాను. శుభం. రాకుమారి కాంతిసేన ఎక్కడ?" అని అడిగాడు.

కాంతిసేనా, భామాసింగీ కొంచెం ఆలస్యంగా అక్కడికి వచ్చి చేరారు. మంత్రి





గంగాధరుడు రాకుమారికి, ఆమె తండ్రి ఉగ్రసేనుడి క్షేమవార్తలు చెప్పి, "ప్రస్తుతం కదంబరాజ్యానికి రాజు లేకపోయినా, నీవు ఆ రాజ్యం చేరిన మరుక్షణం నిన్ను రాణీగా అంగీకరించేందుకు ప్రజలు సిద్ధంగా వున్నారు. ఆ తరవాత నీవు వరించిన వ్యక్తి కదంబరాజవుతాడు," అని చెప్పాడు.

"ఇంకా వరించటమా? శశికాంతుడూ, రాకుమారీ ఏనాడో ఒకర్నొకరు ప్రేమించుకుని వివాహం ఆడేశారు. నేను ఆమెను దొంగిలించుకు వచ్చేప్పుడు చేసిన వాగ్దానం నెరవేర్చుకున్నాను. అవునా, రాజకుమారీ?" అని ప్రశ్నించాడు కుంభీరుడు.

కాంతిసేన ఆ మాటలకు సిగ్గుపడి తల వంచుకున్నది. కాలశంబరుడు మంత్రి గంగాధరుడి ముందుకు వచ్చి, "మహా మంత్రీ! అంతా శుభప్రదంగానే ముగిసింది. ధూమకుడూ, సోమకుడూ చేసిన సహాయాన్ని మరిచిపోకండి. భద్రుడు ఎలానూ మీవాడే. పోతే, నేను కుంభీరుడికి చేసిన వాగ్దానం ఒకటున్నది. అతణ్ణి యీ ప్రాంతాలకు రాజును చేసి, నా దారిన నేను మహాకాళి నర్చించేందుకు కొండల్లోకి పోతాను," అని చెప్పి పొట్టిరాక్షసుణ్ణి, "ఆ దుర్మార్గుడు మహాకలి దాగిన గుహ ఏది?" అని ప్రశ్నించాడు.

పొట్టిరాక్షసుడు గుహ చూపించాడు. మాంత్రికుడు గుహ ముందుకు పోయి మంత్రదండాన్ని పైకెత్తి, "మహాకలీ, బయిటికిరా. నీ చావు సమీపించింది. నాతో ద్వంద్వ యుద్ధానికిరా. నా అనుచరులెవరూ నీ మీద ఆయుధం ఎత్తరు. నువ్వు నన్ను జయించావో, నీ యిష్టంవచ్చిన చోటుకు పోయేందుకు, నా వాళ్ళెవరూ అడ్డు తగలరు," అని కేక వేశాడు.

మరుక్షణం మహాకలి గద భుజాన పెట్టుకుని గుహ నుంచి బయిటికి వస్తూ, "అలా అయితే మనం ధర్మయుద్ధం చేద్దాం.



ఏనుగును గుహలోనే వదిలి వచ్చాను. కాచుకో!" అంటూ మాంత్రికుడి మీదికి లంఘించాడు.

కాలశంబరుడు, అతడి దెబ్బను తన మంత్రదండంతో కాచుకుని, "పాపీ! ముందే చెపుతున్నాను. నువ్వెవరివైతే దొంగ చాటుగా మీదపడి తల నరికి చంపావో, ఆ నా తండ్రిగారిది, యీ మంత్రదండం. ఇది, నీ శరీరాన్ని తాకిందో, నీటి బుడగలాగా పేలిపోతావు. ఇక చూపించు, నీ గదావిద్యాప్రావీణ్యం," అంటూ ముందు కురికాడు.

మాంత్రికుడిలా అనే సరికి మహాకలి నిర్విణ్ణుడై, భయంతో వణికిపోతూ, మంత్ర దండం దెబ్బలను గదతో కాచుకుంటూ, ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు. కాని, కాలశంబరుడు, మహాకలికి పారి పోయే అవకాశం యివ్వకుండా, మీదిమీదికి దూకుతూ, అతడు బాగా అలిసిపోయినట్టు కనబడగానే, "పాపీ, యిక చావు!" అంటూ ఎడం చేత్తో గదను పట్టుకు లాగి, మంత్రదండంతో అతడి గుండెల్లో పొడి చాడు. ఆ వెంటనే కళ్ళను మిరుమిట్లు కొల్పేలాంటి కాంతీ, చెవులు దిబ్బళ్ళు పడే టంత ధ్వనీ ఒకేసారి పుట్టింది. మహాకలి




శరీరం చిన్నాభిన్నమై అంత ఎత్తున గాలి లోకి లేచిపోయింది.

అందరూ కాలశంబరుడికి జయజయ ధ్వానాలు చేశారు. మాంత్రికుడు, మహాకలి గదను కుంభీరుడికిస్తూ, "కుంభీరా! నువ్వు దండకారణ్యానికి రాజువు. పాతాళదుర్గం యింకా ఏమైనా మిగిలి వుంటే దానికి అధిపతివి," అన్నాడు.

"మహామాంత్రికా, నేను నీకు ఆజన్మ కృతజ్ఞుణ్ణి. కొండ మీది సరోవరజలం కింది పాతాళదుర్గం మీదికి ప్రవహించకుండా ఆపవలసిందిగా ప్రార్థిస్తున్నాను," అన్నాడు కుంభీరుడు, మాంత్రికుడికి నమస్కరిస్తూ.

"ఆ పని యీ రాత్రే చేస్తాను. తిరిగి బండరాయిని యథాస్థానంలో పెడితే ప్రవాహం కట్టుబడి పోతుంది. భయపడకు," అన్నాడు కాలశంబరుడు.

ఆ సాయంకాలం మంత్రి గంగాధరుడి పరివారం, కుంభీరుడి అనుచరులూ విందు వినోదాలతో హాయిగా గడిపేశారు. గంగాధరుడు రెండు రోజులపాటు మాంత్రికుడికీ, కుంభీరుడికీ అతిథిగా వుండి శశికాంతుడూ, కాంతిసేనా, పరివారం వెంటరాగా కుంతల దేశానికి బయలుదేరాడు.

అందరూ ప్రయాణం అయి పోయేటప్పుడు కుంభీరుడు, విరూపుణ్ణి పక్కకు పిలిచి, "భామాసింగి జాగ్రత్త. అది మహకలి మీద మోహపడి ఆఖరు క్షణంలో పాతాళదుర్గం వదలనని మొండి కెత్తింది. నోరు మూసి బలవంతంగా భుజాన వేసుకుని బయటికి లాక్కొచ్చాను. దాన్ని భిల్ల నాయకుడు పులిందుడికి ఒప్పచెప్పక పోయావో, నీకూ అతడికీ బతికున్నన్నాళ్ళూ పోరు తప్పదు," అని సలహా యిచ్చాడు.

"అది వాడి పదో పడుచు పెళ్ళాం. కాళ్ళూ చేతులూ కట్టి మోసుకు పోయి అయినా సరే, అతగాడికి ఒప్పచెపుతాను. కాని...మహకలి మీది ఇంత విజయమూ నాకు ఆనందం కలిగించటం లేదు. ఈ జరిగిపోయిన గలభాలో, నా నల్లగరుడుడు దారి తప్పి ఎటో ఎగిరిపోయాడు," అన్నాడు విరూపుడు విచారంగా.

"దాన్ని యీ కొండల్లో ఎక్కడున్నా వెతికి పట్టుకుని, నీకు పంపుతాను, సరేనా?" అంటూ కుంభీరుడు, విరూపుడి నడుం పట్టుకుని గిరగిరా తిప్పి కిందదించాడు.

"అహ్హా, శాంభవీ! నువ్వు రాక్షసుడి వన్న మాటే మరిచాను, సుమా!" అంటూ విరూపుడు పెద్దగా నవ్వి, చాలాదూరం ముందుకు పోయిన తనవాళ్ళను కలుసుకునేందుకు పరిగెత్తాడు. —(అయిపోయింది)





# పుణ్యక్షేత్రం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా. ప్రపంచంలో ఏది నిజంగా పవిత్రమో, ఏది కాదో తెలుసుకోవటం చాలా కష్టం. నీవు ఇలా శ్రమ పడుతున్నది పుణ్యాత్ముడి కొరకో, పాపాత్ముడి కొరకో నాకు తెలియదు. కాని ప్రభాసతీర్థం లాగా అనేక పుణ్యక్షేత్రాలు నిజంగా పుణ్యక్షేత్రాలు కావు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ప్రభాస తీర్థం కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు ప్రతీహార దేశం నుంచి కొందరు వర్తకులు ఒంటెల మీద సరుకులు వేసుకుని మనశూర నగరానికి బయలు దేరారు. వారి ప్రయాణ మంతా ఎడారి

## బేతాళ కథలు



మీదుగానే జరగవలసి ఉన్నది. బిడారుకు నాయకుడు కలిదేవు డనే వర్తక ప్రముఖుడు. అతని వెంబడి ఏడెనిమిదిమంది చిల్లర వర్తకులున్నారు. ఒంటెలను నడిపే వాళ్లూ, ఇతర సేవకులూ, బిడారు రక్షకులూ కలిసి సుమారు మరొక ఇరవైమంది దాకా ఉన్నారు.

ప్రయాణం మూడువంతులకు పైగా సుఖంగానే సాగింది. మనశూర నగరం పన్నెండామడల దూరాన ఉన్నదనగా ఎడారిలో భయంకరమైన ఇసుక తుపాను లేచింది. పట్టపగలే అంధకారమై పోయింది. ఒంటెల మీద కూర్చుని ఉన్న వాళ్ళకు ఒంటెల తలలు కూడా కనిపించలేదు. దాదాపు పన్నెండు గంటలపాటు బిడారు మీద ఎడతెగకుండా ఇసుక వర్షం కురిసింది. అది ఏ అర్ధరాత్రికో నిలిచిపోయింది. అంతటా కటిక చీకటి.

ఆ ప్రమాదం నుంచి ప్రాణాలతో బయట పడిన కలిదేవుడు నక్షత్రాల వెలుగులో చుట్టూ కలయజూస్తే ఒక్క ఒంటె గాని, ఒక మనిషి గాని కానరాలేదు. ఎటు చూసినా ఇసుక దిబ్బలే కనిపించాయి. అతను తన అనుచరులను పిలవ యత్నించాడు గాని, ముక్కులా నోటా ఇసుక పోయినందున గొంతు పెగలలేదు.

కొంత సేపటికి తెల్లవారింది. త్వరలోనే సూర్యుడు కూడా ఉదయించాడు. ఆ పగటి వెలుతురులో కలిదేవుడి కొక భీభత్సమైన దృశ్యం కానవచ్చింది. రెండు ఒంటెలూ, ముగ్గురు సేవకులూ తప్ప మిగిలిన ఒంటెలూ, మనుషులూ ఇసుక తుపాను దెబ్బకు చనిపోయారు. చాలా ఒంటెలూ, చాలామంది మనుషులూ ఇసుక దిబ్బల కింద లోతుగా కూరుకు పోవటం జరిగింది.

ప్రాణాలు దక్కిన సేవకులు కలిదేవుడితో, "బాబూ, మనం బయలుదేరిన వేళ మంచిది కాదు. ఇది చాలా పాపిష్ఠి ప్రదేశం;

మన మనుషులనూ, ఒంటెలనూ పొట్టన పెట్టుకున్నది. ఇక్కడ మనం ఒక్క క్షణం ఉండవద్దు. ముందుకు సాగి పోదాం పదండి," అన్నారు.

కలిదేవుడు వాళ్ళ మాట వినలేదు. "చనిపోయిన మన వాళ్ళందరినీ ఇలా వదిలి ఎలా పోతాం? ఈ శవాల నన్నిటినీ భద్రంగా ఎక్కడైనా పాతేస్తేగాని నేనిక్కడి నుంచి కదలను," అన్నాడతను.

అతని ఆజ్ఞ ననుసరించి సేవకులు ఒక పల్లపు ప్రదేశంలో గొయ్యి తవ్వసాగారు. వాళ్ళు కొంచెం లోతు తవ్వేసరికల్లా నీటి జల వచ్చింది. అది అలా ఉబుకుతూ వచ్చి చూస్తుండగానే పల్లమంతా స్వచ్ఛమైన నీటితో నిండిపోయింది.

ఆ నీటిలో స్నానాలు చేసి, తిత్తులు నించుకుని, ఒంటెలను తాగించారు. అందరికీ పోయిన ప్రాణాలు లేచి వచ్చినట్టయింది. నీరు అమృతం లాగున్నది.

తరవాత కలిదేవుడు వేరే ప్రదేశంలో సేవకుల చేత గోతులు తవ్వించి, ఒక గోతిలో చనిపోయిన మనుషులనూ, మరొక గోతిలో ఒంటెలనూ, మూడో గోతిలో చచ్చిపోయిన వాళ్ళ సరుకులనూ పూడ్చిపెట్టించి, బతికి ఉండిన ఒంటెల మీద తన



సరుకులు మాత్రమే వేసుకుని ప్రయాణం సాగించాడు.

కొంతకాలం గడిచింది. నీటి గుంటలో నీరు అలాగే ఉండి పోయింది. ఒకనాడు గుర్రాల మీద ఎడారి దొంగల ముఠా అటుగా వచ్చింది. వాళ్ళు ఎండలో చాలా దూరం ప్రయాణించి, దాహంతో తల్లడిల్లి పోతున్నారు. అటువంటి సమయంలో వాళ్ళు ఆ నీటిగుంట వద్దకు వచ్చి, అందులోని నీరు తాగి, గుర్రాలను తాగించి ప్రాణాలు నిలబెట్టుకున్నారు.

దొంగల నాయకుడు ఆ గుంట కేసి చూస్తూ ఆశ్చర్యంగా ఆలోచించాడు. ఎడా



రిలో ప్రతి అంగుళమూ అతనికి తెలుసు. నెల రోజుల క్రితం తన ముఠా ఇటుగా వచ్చినప్పు డిక్కడ ఈ నీటిగుంట లేదు. గుంటలో కేవలమూ నీ రుండటమే కాదు, అడుగున బలమైన జల ఉండి, నీరు పైకి ఉబికి వచ్చి, చుట్టూ ఉండే ఇసుకలోకి ఇంకి పోతున్నది. గుంట చుట్టూ చాలా మేర ఇసుక తడితడిగా ఉన్నది.

"ఎడారి దొంగగా బతికే కంటే ఈ గుంటను సొంతం చేసుకుని కూర్చుంటే జీవితం హాయిగా వెళ్ళిపోతుంది. కత్తి యుద్ధాలు మానేసి, అందరి చేతా గౌరవ మర్యాదలు పొందవచ్చు. ముందు ఈ గుంటను పెద్దది చెయ్యాలి. తరవాత ఇక్కడ ఒక దేవతను ప్రతిష్ఠ చెయ్యాలి. ఆ పని ముగిసినాక నేను కాషాయవస్త్రాలు ధరించి దేవతకు పూజారినవుతాను. మీరు నా శిష్యులై, ఇక్కడొక పుణ్యక్షేత్రం వెలిసిందని చుట్టు పట్ల నగరాలలో ప్రచారం చేసి రండి. సార్థవాహులకు నీరు అమ్ముకున్నా మన జీవితాలు సుఖంగా వెళ్ళిపోతాయి. ఇక ప్రజలు దీన్ని పుణ్యక్షేత్రంగా ఆమోదిస్తే ఇక అడిగారూ?" అన్నాడు దొంగల నాయకుడు తన అనుచరులతో.

అతని ఎత్తు బాగా పారింది. దొంగలు గుంటను పెద్దది చేసి మంచి కొలను ఏర్పాటు చేశారు. వాళ్ళ ప్రచారం ఫలితంగా యాత్రికులు అక్కడికి రాసాగారు. యాత్రికులూ, వర్తకులూ ఆగటానికి దొంగలు కలపతో కొన్ని చావడుల లాటివి కట్టారు. యాత్రికుల దృష్టిలో దొంగల గురువూ, అతని అనుచరులూ పవిత్రులయిపోయారు.

ఎడారిలో ఉన్న ఈ పుణ్యతీర్థం గురించి రకరకాల వదంతులు వ్యాపించాయి. ఆ తీర్థంలో నీరు తాగిన వారికి మొండి రోగాలు కూడా నయమవుతున్నాయి. అనేక మంది రోగులూ, వృద్ధులూ, దిక్కులేని

వాళ్ళూ ఆ తీర్థానికి వచ్చి, చెక్కని శిల రూపంలో ఉన్న దేవికి దణ్ణాలు పెట్టుకుని, అక్కడ ఉండి పోవటానికి నిశ్చయించారు.

మనశూర నగరపు రాజు ఈ తీర్థం గురించి విని, ఒకసారి చూసి పోదామని వచ్చాడు. తీర్థంలో కనిపించిన యాత్రికులతో మాట్లాడాడు. అందరూ తీర్థ మాహాత్మ్యం గురించి తెగ పొగడేవారే. రాజు తృప్తిపడి అక్కడ ఒక చిన్న నగరం ఏర్పాటు కావటానికి తగిన ధన సహాయం చేసి, మనుషులను నియోగించాడు. రాజు తలచుకుంటే ఎంతసేపు? కోనేటి ఒడ్డున అమ్మవారికి ఒక చలవరాతి గుడీ, యాత్రికులకు నివాసాలూ, అక్కడే ఉండి పోయి, ఆలయానికి రకరకాల సేవలు చేసేవారికి ప్రత్యేకంగా ఇళ్ళూ, దుకాణాలూ, చెట్లూ చేమలూ, సమస్తమూ ఏర్పాటయాయి. ఎడారిలో ఒక ప్రాంతం నుంచి ఇంకో ప్రాంతానికి వర్తకం చేసుకోబోయే వారికి ప్రభాసతీర్థం వీలయిన కూడలిగా తయారై, త్వరలోనే గొప్ప వర్తక కేంద్రమయింది.

తీర్థానికి ఏటా రాబడి పెరిగి రాసాగింది. రాజు దానిలో ఒక్క గవ్వ కూడా ముట్ట లేదు. ఆ సొమ్మంతా దొంగలే ఉంచేసుకున్నారు. అయినా దొంగలూ, వాళ్ళ నాయకుడూ ఆ తీర్థాన్ని వదిలి పెట్టి వెళ్ళిపోలేదు.



వాళ్ళు బతికినన్నాళ్ళూ అక్కడే బతికి, అక్కడే చనిపోయారు. దొంగల నాయకుడి అనంతరం రాజుగారు ఆలయానికి ఒక ధర్మకర్తను జీతం మీద ఏర్పాటు చేసి, ఆదాయంలో సగం భాగం తను తీసుకుని, మిగతాది ప్రభాసతీర్థం యొక్క కార్య కలాపాలకు వదిలేస్తూ వచ్చాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, పరమ పాపులైన దొంగలు జనాన్ని మోసగించి ఏర్పాటు చేసిన ప్రభాసతీర్థం ఎలా అభి వృద్ధిలోకి వచ్చింది? అలాటి అపవిత్రమైన తీర్థం ప్రజలను ఎలా ఆకర్షించింది? ఇదంతా ధర్మవిరుద్ధంగా జరిగినది గదా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెక్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రభాసతీర్థం అపవిత్రమైన దనటానికి ఆధారమేమీ కన పడటం లేదు. అక్కడి మడుగు ఒక పుణ్యాత్ముడు తల పెట్టిన పుణ్యకార్యం ఫలితంగా ఏర్పడినది. కలిదేవుడు తన అను చరుల శవాలను శ్రద్ధగా ఖననం చేశాడు, ఎండకూ, వానకూ వదిలేసి వెళ్ళిపోలేదు. దొంగల ముఠా ఆ మడుగు దగ్గిరికి వచ్చే సరికే అది పుణ్యక్షేత్రం. అందుచేతనే దొంగల గురువుకు వర్తకులను దోచే ఆలో చనపోయి ఆ తీర్థాన్ని అభివృద్ధి చేయాలన్న సంకల్పం కలిగింది. ఒక పుణ్యతీర్థంలో ఎందరు పాపులైనా నివాసం ఏర్పరచుకో వచ్చు. వాళ్ళ మూలాన దాని పవిత్రత చెడిపోదు. ఆ తీర్థాన్ని ఆశ్రయించాక ఎడారి దొంగలు తమ పాపాలను పోగొట్టుకున్నా రని కూడా చెప్పవచ్చు. అందుచేతనే వాళ్ళు చేతికి చిక్కిన డబ్బుతో పారిపోక, బతికినన్నాళ్ళూ తీర్థంలోనే బతికి, చివరకు అక్కడే చనిపోయారు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ఋణానుబంధం

ఒక గ్రామంలో రామశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన బాగా చదువుకున్నవాడూ, ఉపాసనాపరుడూనూ. ఆయన భార్యకూడా చాలా అనుకూలవతి. "బిడ్డలు లేరో," అని ఎవరైనా అలమటిస్తూంటే వారితో రామశర్మ, "ఋణానుబంధం లేందే పిల్లలు ఎందుకు పుడతారు? ఏ జన్మానో చేసిన బాకీలు పుచ్చుకోవటానికో, తీర్చుకోవటానికో పిల్లలు పుడతారు," అనేవాడు. అది ఆయన దృఢవిశ్వాసం.

అందుచేత, తన భార్య తొలి కానుపున మగపిల్లవాణ్ణి కన్నప్పుడు రామశర్మ ఆ బిడ్డను తీసుకుని శ్మశానానికి వెళ్లి, అక్కడ ఒక గుంట తవ్వి, అందులో శిశువు నుంచి, మంత్రజలం చల్లి, "ఒరే, ఎవడురా నువ్వు? నా కెందుకు పుట్టావు?" అని అడిగాడు.

ఆ శిశువు, "అయ్యా, నేను కిందటి జన్మలో కట్టెలు కొట్టి జీవించేవాణ్ణి. నాచేత కట్టెల మోపు ఒకటి వేయించుకుని, దానికి డబ్బిచ్చావు కావు. ఆ బాకీ వసూలు చేసుకోవటానికి నీకు పుట్టాను," అన్నాడు.

"నీకు నే నెంత బాకీ ఉన్నాను?" అని రామశర్మ అడిగాడు.

"రెండణాలు," అని శిశువు చెప్పాడు.

"రెండణా లిస్తే పోతావా?" అని రామశర్మ అడిగాడు.

"పోతాను," అన్నాడు శిశువు.

రామశర్మ బొడ్డు నుంచి రెండణాలు తీసి ఆ శిశువు మీద ఉంచే సరికి, శిశువు కాస్తా ప్రాణం వదిలాడు. రామశర్మ ఆ శిశువును పూడ్చి ఇంటికి తిరిగి వచ్చాడు.

మరొకటి రెండు కాన్పుల బిడ్డలను కూడా రామశర్మ ఇలాగే చేసేసరికి భార్య, "నేను కష్టపడి కన్న బిడ్డ లందరినీ ఎందుకిలా చంపి వస్తున్నారు?" అని లబలబలాడింది.

అన్నాప్రగడ సాంబశివప్రసాద్



''నాలో నీకు నమ్మకం లేదు. ఈ సారి పుట్టే బిడ్డను నీకు భద్రంగా తెచ్చి ఇస్తాను. అప్పుడు నాలో నీకు నమ్మకం కుదురుతుంది,'' అన్నాడు రామశర్మ.

రామశర్మ ఈసారి పుట్టిన బిడ్డను కూడా శ్మశానానికి తీసుకుపోయి, మంత్ర జలం చల్లి, మామూలు ప్రశ్నలు వేశాడు. ఆయన ప్రశ్నలకు సమాధానంగా ఆ శిశువు, "నేను పూర్వజన్మలో ఆముదం అమ్ముకునేవాణ్ణి. నువు నాకు మణుగు ఆముదానికి బాకీ ఉన్నావు,'' అన్నాడు.

"మణుగు ఆముదం ఇస్తే పోతావా?'' అని రామశర్మ అడిగాడు.

"పోతాను,'' అన్నాడు శిశువు. రామశర్మ ఆ శిశువును భార్యకు అప్పగించి, ఒక మణుగు ఆముదం తెచ్చి ఇంట్లో ఉంచి, "ఈ ఆముదం అయిపోయే దాకా వీడు నీకు దక్కుతాడు,'' అన్నాడు భార్యతో. భర్త చెప్పిన ప్రకారం ఆమె ఆ బిడ్డకు ఆ ఆముదమే పెడుతూ వచ్చింది.

ఆముదం అయిపోవస్తున్న సమయంలో బిడ్డకు ఏదో రోగం పెట్టుకువచ్చి, ఆముదం తరిగిన కొద్దీ ముదర సాగింది.

"వీడి బాధ చూడలేకుండా ఉన్నాను. పోయినా బాగుండును. ఆముదం అయిపోయిందే, వీడింకా రుణం తీరి చావక ఎందుకు బతికి ఉన్నాడు?'' అని భార్య రామశర్మ నడిగింది.

"కుండకు అంటుకున్న దంతా తుడిచి వాడికి పట్టించు, పోతాడు,'' అన్నాడు రామశర్మ. ఆయన భార్య అలాగే చేసింది. బిడ్డ ప్రాణాలు విడిచాడు. ఇది జరిగాక ఆమెకు తన భర్త మాటలలో బాగా గురి కుదిరింది.

అటు తరవాత ఆమె మరొకసారి ప్రసవించింది. రామశర్మ ఆ బిడ్డను కూడా శ్మశానానికి తీసుకుపోయి, పోయిన బిడ్డలను అడిగినట్టే అడిగాడు.

"అయ్యా, కిందటి జన్మలో నేను నీ దగ్గిర రెండువేల రూపాయలు తీసుకుని ఎగవేశాను. ఆ బాకీ తీర్చుకోవటానికి మీ కడుపున పుట్టాను," అన్నాడు శిశువు.

రామశర్మ ఆ బిడ్డను తీసుకువచ్చి భార్య చేతికిచ్చి, "ఈ బిడ్డ మనకు ఎంత కాలమైనా దక్కుతాడు. కాని వీడి నుంచి పొరపాటున కూడా ఏమీ తీసుకోకు. తీసుకున్నావో, వీడు మనవాడు కాడు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

పిల్లవాడికి మాధవు డని పేరు పెట్టుకున్నారు. వాడు శుక్లపక్ష చంద్రుడల్లే దినదినాభివృద్ధి చెందుతూ పెరిగాడు. తండ్రి వద్దనే విద్యలన్నీ చదివి, త్వరలోనే సంపాదనాపరుడు కూడా అయాడు. వాడెంత సంపాదించినప్పటికీ తల్లిదండ్రులు వాడి నుంచి ఎర్ర ఏగానీ తీసుకోలేదు.

ఒకనాడు మాధవుడు ఒక మూట తీసుకుని ఏదో వ్యవహారం మీద గ్రామాంతరానికి బయలుదేరి, వాకిట ఉన్న తన గుర్రాన్ని ఎక్కబోయాడు. ఎందుచేతనో గుర్రం మకురుతనం చేసింది. తనను సాగనంప వచ్చి తలవాకిట నిలిచి ఉన్న తల్లికి తన మూట ఇస్తూ, "అమ్మా, ఈ మూట కాస్త పట్టుకో, గుర్రమెక్కి తీసుకుంటాను," అని మాధవుడు గుర్రాన్ని ఎక్కబోయాడు. గుర్రం వెనకకాళ్ళతో మాధవుడి గుండెల్లో తన్నింది. ఆ క్షణమే మాధవుడు కింద పడి ప్రాణాలు విడిచాడు.

ఎక్కడికో వెళ్ళి వచ్చిన రామశర్మ తన కొడుకు శవాన్నీ, ఏడుస్తున్న తన భార్యనూ చూశాడు. ఆమె చేతిలో ఉన్న మూట తీసుకుని విప్పి చూస్తే అందులో సరిగా రెండువేల రూపాయలున్నాయి.

"ఎందు కేడుస్తావు? వాడి ఋణం తీర్చుకుని వాడు వెళ్ళిపోయాడు. ఇందుకే, వాడి నుంచి ఏమీ తీసుకోవద్దని చెప్పాను," అని రామశర్మ భార్యను ఓదార్చాడు.





# చంద్రసేన

చంద్రగిరి రాజ్యాన్ని ఉగ్రసేను డనే రాజు పాలించేవాడు. అతను కఠినుడూ, క్రూరుడూ, మూర్ఖుడూ కూడానూ. అటు వంటివాడి కింద కొలువు చెయ్యటం అంటే, ప్రధాన మంత్రి మొదలుకుని సామాన్య భటుడి దాకా అందరికీ బాధగానే ఉండేది.

ఉగ్రసేనుడి భార్య శాంతాదేవి. ఆమె పేరుకు తగ్గట్టే అతిసౌమ్యురాలూ, సుగుణ వతీ, దయాపరురాలూనూ. రాజభవనంలో వాళ్ళూ, నగరంలోవాళ్ళూ కూడా రాజును చూసి ఎంత భయపడేవాళ్ళో, తమ రాణిని చూసి అంత జాలిపడేవాళ్ళు. జాలి పడటం దేనికంటే, శాంతాదేవికి పిల్లలు లేరు. పిల్లల కోసం ఆమె ఎంత తపించి పోయిందో, ప్రజలు కూడా అంత తపించి పోయారు. శాంతాదేవి కడుపున ఒక నలుసు పుడితే, ఆ బిడ్డను రాజుగా ప్రకటించి, ఉగ్రసేనుణ్ణి అడవులకు తరమ టానికి కూడా ప్రజలు సిద్ధంగా ఉన్నారు. ఉగ్రసేనుడు నిస్సంతుగా చనిపోతే రాజ్యం ఏ పరరాజు పాలవుతుందోనని మంత్రి మొదలైనవారి భయం.

ఇలా ఉండగా చంద్రగిరి నగరానికి ఒకనాడు ఒక ముని వచ్చాడు. ఉగ్ర సేనుడు ఆయనకు ఆతిథ్య మిచ్చాడు. రాణీ ఆ మునితో తనకు గల సంతాన వాంఛ గురించి చెప్పింది. ముని తన కమండలం నుంచి ఒక పండు తీసి రాణి చేతిలో పెట్టి, "అమ్మా, ఈ రాత్రి పడుకో బోయే ముందు దీనిని తిని నిద్రపో. నీకు ఒక ఆడపిల్ల పుట్టి, కాలక్రమాన ఈ దేశా నికి రాణి అవుతుంది," అని చెప్పాడు.

ఆ సాయంకాలం ముని తన దారిన వెళ్ళిపోగానే ఉగ్రసేనుడు తన భార్యతో, "నువు ఆ ముని ఇచ్చిన పండు తినకు. ఆడపిల్ల పుట్టటం కూడా ఒక వరమేనా?

బి. వరలక్ష్మి, బి. ఏ.

నా అనంతరం నా రాజ్యాన్ని ఒక ఆడది ఏలటం నేను ఎంతమాత్రమూ సహించను," అన్నాడు.

"ఏదో ఒక బిడ్డ అంటూ కలగనివ్వండి. ఆ ముని ఎంతో ఆదరంతో ఇచ్చిన పండును తినకుండా ఉండటం అపచారం. ఆయన మహాత్ముడు," అని శాంతాదేవి తన భర్తను వేడుకున్నది.

తన మాట కాదన్నందుకు ఉగ్రసేనుడు మండిపడ్డాడు. "ఆ ముని అంత మహాత్ముడైతే నీకు మగపిల్లవాడు కలిగేటట్టు అనుగ్రహించలేకపోయాడా? నన్ను అవమానించటానికే నీకా పండు ఇచ్చాడు," అంటూ ఆ ధూర్తరాజు, ముని ఇచ్చిన పండును తెచ్చి, బలంకొద్దీ దూరంగా విసిరివేశాడు.

అదే సమయానికి ఒక కాపు స్త్రీ పొలం నుంచి గడ్డితట్ట ఎత్తుకుని, నెత్తిన పెట్టుకుని, రాజభవనం పక్కగా తన ఇంటికి పోతున్నది. రాజు విసిరిన పండు ఆ కాపు మనిషి నెత్తిన ఉన్న గడ్డితట్టలో పడింది. ఆ మనిషి ఆ తట్టను ఇంటికి తీసుకుపోయి, గడ్డిని పశువులకు వెయ్యటానికిగాను తట్ట వంచేసరికి అందులో పండు కనబడింది. అది తన తట్టలోకి ఎలా వచ్చిందో ఆ మనిషికి అర్థం కాలేదు.



ఏ దేవతలో ఆకాశం నుంచి ఆ పండును పడేసి తనను అనుగ్రహించి ఉంటారనుకుని, ఆమె ఆ పండును భక్తిగా కళ్ళకు అద్దుకుని, తినేసి, పడుకుని నిద్రపోయింది.

ఆ కాపుమనిషి రాణి కన్న కూడా పెద్దది. ఆమెకూ పిల్లలు లేరు. కాని ఈ పండు తిన్న కొద్దికాలానికే ఆమె గర్భవతి అయింది. తాను గర్భవతి కావటానికి పండే కారణమై ఉంటుందని ఆమె తన మొగుడితో చెప్పింది. క్రమంగా ఈ సంగతి చుట్టుపక్కలవాళ్ళకు కూడా తెలిసింది. కాని ఎవరూ నమ్మలేదు. అలాటివి పేద వాళ్ళకు జరగవు. ఏ మునీశ్వరుడో ఏ మహా



రాణికో పండిస్తే, అది తిన్న ఫలితంగా పిల్లలు పుట్టి, వాళ్ళు గొప్పవాళ్ళు కావచ్చు. అంతేగాని పేదకాపు స్త్రీలకు అలాటివి సాధ్యంకాదు అనుకున్నారు అందరూ.

కాలక్రమాన కాపుమనిషికి ఒక ఆడ పిల్ల కలిగింది. ఆమె ఆ బిడ్డను తీసుకుని నగరంలోని దేవి ఆలయానికి వెళ్ళి, తన శక్తికొద్దీ దేవికి ముడుపులు చెల్లించింది. అదే సమయానికి రాణి శాంతాదేవి కూడా ఆలయానికి వచ్చింది. ఒక సామాన్య కాపు మనిషి చేతిలో వెలిగిపోతున్నట్టుగా ఉన్న పసిగుడ్డును చూసి ఆశ్చర్యపడి, "ఎవరి బిడ్డే ఇదీ?" అని అడిగింది.

కాపుమనిషి తాను పండు తిన్న కథంతా చెప్పింది. వివరాలన్నీ విన్నాక రాణికి సంగతి బోధపడింది. తాను తినవలసిన పండును ఈ కాపుమనిషి తిని, తాను కన వలసిన పిల్లను కన్నది. ఆ పిల్ల పెరిగి పెద్దదై తమ రాజ్యాన్ని తప్పక ఏలుతుంది. ఆ మహాముని నోటిమాట అబద్ధం కాదు.

అందుచేత రాణి ఆ కాపుమనిషితో, "ఒసే, ఈ బిడ్డ అచ్చగా నీ బిడ్డే అనుకోకు. ఇది నా బిడ్డ కూడానూ. దీనికి ఏ లోటూ రానివ్వకు. దీన్ని రాణివాసంలో పెంచి నట్టు పెంచుదాం," అన్నది. కాపుమనిషి ఆనందపారవశ్యంలో మునిగి తేలుతూ, రాణికి వెయ్యి దణ్ణాలు పెట్టింది. ఆ నాటి నుంచీ ఇద్దరూ ప్రతి సాయంకాలమూ దేవి ఆలయంలో కలుసుకునేటందుకు ఏర్పాటు చేసుకున్నారు.

తరవాత శాంతాదేవి తన భవనానికి దగ్గిరలోనే ఒక బాలక్రీడామందిరం కట్టించి, దాన్ని కనిపెట్టుకుని ఉండటానికి కాపు దంపతులకు అందులోనే వసతి కలిగించింది. అక్కడికి నగరంలోని ఉన్నత కుటుంబాలకు చెందిన పిల్లలు వచ్చి రకరకాల ఆటలు ఆడుతూండేవారు. వాళ్ళ ఆటలు చూసే నెపం మీద రాణి రోజూ

అక్కడికి వెళ్ళి కాపుకుమార్తెను ఆడిం చేది. ఆ బిడ్డకు చంద్రసేన అని రాణి నామకరణం చేసింది.

చంద్రసేన కావటానికి కాపుకూతురే అయినా మిగిలిన కులీనుల బిడ్డలకు ఎందు లోనూ తీసిపోయేది కాదు. అందరితోపాటు చదువుకున్నది, మగపిల్లలతో సమంగా విలువిద్యా, కత్తిసామూ, గుర్రపుస్వారీ నేర్చుకున్నది. ఆ పిల్ల ధరించే దుస్తులూ, ఆభరణాలూ చూసి ఆమె కాపుపిల్ల అని ఎవరూ అనుకునేవారు కారు.

చంద్రసేన పదహారేళ్ళ వయసుదై ఉండగా రాజుకు ఆమె జన్మ రహస్యం తెలిసింది. తాను పారేసిన పండు వృథా పోలేదు. దాన్ని ఎవరో తక్కువజాతి స్త్రీ తిని, తన రాజ్యానికి వారసురాలైన పిల్లను కన్నది. ఉగ్రసేను డిది సహించలేకపోయాడు. ఈ రహస్యం తన భార్యకు మొదటి నుంచీ తెలుసుననీ, పాముకు పాలుపోసి పెంచిన విధంగా ఆమె ఈ పిల్లను చాటుగా సాకు తున్నదనీ కూడా రాజు తెలుసుకున్నాడు. ఆయన వెంటనే తన రాణిని కారా గృహంలో పెట్టించి, చంద్రసేనను చంప మని తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు. బాల క్రీడామందిరాన్ని మూసేశారు. చంద్రసేన



తల్లిదండ్రులైన కాపుదంపతులకు దేశ బహిష్కారం విధించబడింది.

రాజభటులు చంద్రసేనను చంపటానికి నగరం వెలపలకు తీసుకుపోయారు, కాని వాళ్ళు ఆమెను చంపలేదు. తమ రాణిని కారాగృహంలో ఉంచినందుకు వాళ్ళకు రాజు పైన చాలా కోపంగా ఉన్నది. అందు చేత వాళ్ళు చంద్రసేనకు తమ గుర్రాలలో ఒకటి ఇచ్చి అరణ్యంలోకి పారిపొమ్మని చెప్పి, ఏ అడవిమృగాన్నో చంపి, తమ నెత్తురు కత్తులను రాజుకు చూపించారు.

అరణ్యంలోకి పారిపోయిన చంద్రసేన తిన్నగా ఆటవికుల పల్లెకు పోయింది.

ఈ ఆటవికులు నిజానికి అరణ్యవాసులు కారు. ఒకప్పుడు చంద్రగిరిలోనే ఉండిన ఒక తెగకు చెందినవాళ్ళు. వాళ్ళు కొన్ని రాజశాసనాలను ధిక్కరించటం చేత ఉగ్రసేనుడు వారిని అరణ్యాలలోకి తరిమేశాడు. అక్కడ కూడా వాళ్ళను శాంతంగా ఉండనివ్వక అస్తమానమూ వాళ్ళ పైకి దండు పంపి, హింసాకాండ నడిపించేవాడు.

అరణ్యంలో చేరి ఆటవిక జీవితం జీవించే ఈ తెగలోని యువకులు అనేక రకాల యుద్ధతంత్రాలు నేర్చి, రాజు తమ పైకి పంపే సేనలను నిర్మూలిస్తూ వచ్చారు.

చంద్రసేన ఆటవికులకు తన కథ అంతా చెప్పి, "మీకు రాజు బాధలేకుండా చేస్తాను. నా వెంట రాజధానిపైన యుద్ధానికి బయలుదేరండి," అన్నది. ఆటవికుల పెద్దలు కూడబలుక్కుని సరే నన్నారు. చంద్రసేన మగవేషం వేసుకుని, రెండు వందలమంది ఆటవిక యోధులను మాత్రమే వెంటబెట్టుకుని చంద్రగిరికి బయలుదేరింది. నిరాయుధులుగా వచ్చే వారిని చూసి ఎవరూ అడ్డగించలేదు.

చంద్రసేన తన ఆటవికులతో ముందుగా ఆయుధాగారానికి వెళ్ళి, దొమ్మిచేసి ఆయుధాలు సంపాదించింది. తరవాత అందరూ కలిసి రాజభవనం మీద దాడి చేశారు. ఉగ్రసేను డొక్కడే కత్తి తీసుకుని పోరాడి, వీరమరణం పొందాడు. తరవాత ఆమె సింహాసనం మీద కూర్చుని సభికులందరినీ పిలిచి, వారి అనుమతితో రాణి అయింది. శాంతాదేవికి కారాగారవిమోచనం కలిగింది. కాపుదంపతులు తిరిగి వచ్చారు.

చంద్రసేన పట్టాభిషేకం చాలా వైభవంగా జరిగింది. ఆమె కథను పాటలు కట్టి పాడారు. తరవాత ఆమె ఆటవికుల కందరికీ నివాసాలు తిరిగి ఏర్పాటు చేసి, వారిలో మహాశూరుడైన యువకుణ్ణి పెళ్ళాడి చాలా కాలం సుఖంగా రాజ్యం చేసింది.






# నెల జీతం

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతను పరమ పిసినిగొట్టు. ఒకసారి అతను ఒక పనివాణ్ణి పెట్టుకున్నాడు. పనిలో పెట్టుకునే ముందు రైతు వాడితో, "ఒరే, నెలకు నీకు నాలుగు రూపాయలు జీతమిస్తాను. కాని వాటిని నువు సంపాదించుకోవాలంటే నే నడిగే నాలుగు ప్రశ్నలకు సరి అయిన సమాధానాలు చెప్పాలి. చెప్పలేకపోతే నీకు నాలుగు రూపాయలకు బదులు నాలుగు మొట్టికాయలిచ్చుకుంటాను," అన్నాడు.

"అట్లాగే చెయ్యండి," అన్నాడు పనివాడు. వాడికి రైతు యొక్క దురుద్దేశం అర్థం కాలేదు.

పనివాడు నెల పొడుగునా చచ్చేటట్టు అడ్డమైన చాకిరీ చేశాడు. నెల పూర్తి అయింది. రైతు వాణ్ణి పిలిచి, "ఒరే, నీ కివాళ జీతం ఇవ్వాలి. ఇట్లా లోపలికి వచ్చి నే నడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పి నీ జీతం సంపాదించుకో," అన్నాడు.

ఇద్దరూ చలిమంట దగ్గిరికి వెళ్ళి కూర్చున్నారు. దానికి సమీపంలోనే ఒక పిల్లి చుట్టచుట్టుకుని పడుకుని ఉన్నది.

రైతు పనివాడికి పిల్లిని చూపించి, "ఇది ఏమిటి?" అని అడిగాడు.

"పిల్లిగదండీ?" అన్నాడు పనివాడు.

"కాదు, శుచిత్వం. తప్పు చెప్పినందుకు ఒక మొట్టికాయ తీసుకో," అంటూ రైతు పనివాడి నెత్తిన ఒక మొట్టికాయ వేశాడు. తరవాత రైతు నిప్పును చూపించి, అది ఏమిటని అడిగాడు.

"నిప్పు," అన్నాడు పనివాడు.

"కాదు, సుఖం! తప్పు చెప్పినందుకు మరో మొట్టికాయ!" అన్నాడు రైతు.

తరవాత రైతు నీటికుండను చూపించి, "అదేమిటి?" అన్నాడు.

సి. నాగరాజు

"మట్టికుండేగా?" అన్నాడు పనివాడు.

"తప్పు. దాన్ని శరీరమనాలి," అంటూ రైతు మూడో మొట్టికాయ ఇచ్చుకున్నాడు.

చివర కతను ఇంటికప్పు కేసి చూపించి, అదేమిటని అడిగాడు.

"కప్పు," అన్నాడు పనివాడు.

"కాదు. ఎత్తు అనాలి," అంటూ రైతు వాడికి నాలుగో మొట్టికాయ ఇచ్చుకుని, "కిందటి నెల పని చేసినందుకు నీ జీతం ముట్టింది. నీ కిష్టమైతే ఇదే పద్ధతి మీద ఇంకో నెల పని చేసి జీతం పుచ్చుకో. ఇష్టం లేదా, వెళ్ళి పో," అన్నాడు.

"అప్పుడే వెళ్ళనులెండి. మీ ప్రశ్నలకు సరి అయిన బదులు చెప్పేదాకా ఉండి, అ తరవాత పోతాను," అన్నాడు పనివాడు. తరవాత కొంతసేపటికి రైతు పొలానికి వెళ్ళాడు. పనివాడు పిల్లి తోకకు నూనెగుడ్డ చుట్టి అంటించి, దాన్ని ఇంటి కప్పు మీద ఎక్కించాడు. కప్పు అంటుకున్నది. పనివాడు కుండలో నీళ్ళుపోసి మంటల మీద ఊయసాగాడు.

దొడ్లో పని చూసుకుంటున్న రైతు భార్య ఇంటికప్పు మండుతూ ఉండటం చూసి, "నీళ్ళు పుక్కిలించి ఊస్తే నిప్పు ఆరుతుందిట్రా? పొలానికి పోయి మీ యజమానితో చెప్పిరా," అన్నది.

పనివాడు పొలానికి వెళ్ళి రైతుతో, "అయ్యా, శుచిత్వం సుఖాన్ని తీసుకుని ఎత్తుకు వెళ్ళింది. ఎత్తు మహాసుఖంలో ఉంది. శరీరంలో ఉన్న నీరంతా ఊసినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఇక నేను పోతున్నాను," అంటూ తన దారిన వెళ్ళిపోయాడు.

పనివాడు చెప్పినది ఒక్కముక్క కూడా రైతుకు అర్థం కాకపోవటంచేత అతను ఇంటికి పోలేదు. రైతు ఇల్లూ, అందులో సామాన్లూ సాంతం పరశురామ ప్రీతి అయిపోయాయి.





# ముసలమ్మ సుఖం

ఒక రాజూ, మంత్రీ మారు వేషాలలో గ్రామాల వెంట తిరుగుతూ తమ దేశం ఎలా ఉన్నదీ పరిశీలిస్తూ పోతూండగా, ఒక గ్రామంలో ఒక పాకాయింటి అరుగు మీద కూర్చున్న ముసలమ్మ, "నా కింకా ఈ కష్టాలు ఎన్నాళ్ళో! ఆ దేవుడు నన్నెప్పుడు తీసుకు పోతాడో!" అంటూ ఆపసోపాలు పడటం వినిపించింది.

ముసలిదానికి వచ్చిన కష్టం ఏమిటో తెలుసుకుందామని రాజు ఆమెను సమీపించి, "నీకు వచ్చిన కష్టం ఏమిటి, అవ్వా? మాతో చెప్పు, సహాయం చేస్తాం," అన్నాడు.

"రండి, నాయనలూ! కూర్చోండి! దూరం నుంచి వస్తున్నట్టున్నారు. నా కష్టం మీరేం తీర్చగలరు? ఈ జన్మ కిక ఇంతే. నా కున్నదల్లా ఒక్క మనవరాలు. అది ఎప్పుడో ఒకసారి వచ్చి చూసి పోతూంటుంది. పోనీ దాని దగ్గిరే ఉందామంటే దాని అత్తవారికీ, నాకూ పడలేదు. అందుచేత నే నీ కొంపలో ఒంటరిగా ఉంటూ, ఎరిగిన ఇళ్ళలో చాకిరీ చేసి పొట్టపోసుకుంటూ ఆ దేవుడు ఎప్పుడు పిలుస్తాడా అని ఎదురు చూస్తున్నాను," అన్నది ముసలమ్మ ఎంతో విరక్తిగా.

"ఈ వయసులో నువు కష్టపడి డబ్బు సంపాదించలేవు. ఈ డబ్బు తీసుకుని, దానితో సుఖంగా కాలక్షేపం చెయ్యి," అంటూ రాజు ముసలిదానికి ఒక వంద రూపాయల సంచీ ఇచ్చి, మంత్రితో సహా ముందుకు సాగిపోయాడు.

ఒక వారం గడిచాక రాజూ, మంత్రీ తమ రాజధానికి తిరిగి పోతూ మళ్ళీ అటుగానే వచ్చారు. ముసలమ్మ అరుగు మీద కూర్చుని, "ఎంత కాలం, బాబూ, ఈ కష్టాలూ! ఈ జన్మకు విరగడ ఎప్పుడో!" అని ఆపసోపాలు పడుతున్నది.

ఎల్. ఇందుమతి



ఆమె ధోరణిలో మార్పు లేకపోవటం గమనించి ఆశ్చర్యపడి, రాజు ఆమెను సమీపించి, "బాగున్నావా, అవ్వా? నే నిచ్చిన డబ్బు అయిపోయిందా, లేక ఇంకా ఉన్నదా?" అని అడిగాడు.

"ఆ డబ్బు నే నేం చేసుకుంటాను, నాయనలూ? మనవరాలు వస్తే దాని కిద్దామని దాచి ఉంచాను. అదెప్పుడు వస్తుందో, ఏమో? ఈ లోపల ఆ డబ్బు కాస్తా ఏ దొంగల పాలవుతుందో నని భయపడి చస్తున్నాను," అన్నది ముసలమ్మ.

"చూడు, అవ్వా. రేపు నా మనుషులను పంపిస్తాను. వాళ్ల వెంట నువు మా ఇంటికి వచ్చెయ్యి. అక్కడ నీకు అన్నీ సుఖంగా అమరేటట్టు నేను ఏర్పాటు చేస్తాను," అని రాజు వెళ్ళిపోయాడు.

మర్నారు రాజభటులు ముసలిదాని కోసం మేనాతో వచ్చారు. తనను పలకరించినవాడు రాజే నని తెలిసి ముసలిది చాలా కంగారు పడింది. రాజాజ్ఞ గనక, ఇష్టమున్నా లేకపోయినా మేనా ఎక్కి వెళ్లక తప్పలేదు.

రాజభటులు ముసలిదాన్ని రాజభవనంలో ఒకమూల ఏర్పాటు చేశారు. ముసలిదానికి భోజనం రాజభవనం నుంచే వస్తున్నది.

ఇక ముసలిదానికి జీవితం స్వర్గం లాగా ఉంటుం దనుకున్నాడు రాజు. కొన్ని రోజులయాక రాజు ఒకనాటి ఉదయం ఆమెను చూడవచ్చి, "సుఖంగా ఉన్నావా, అవ్వా?" అని అడిగాడు.

ముసలిది దిగులు ముఖం పెట్టి, "సుఖంగా లేకేం, నాయనా? నా యిల్లూ వాకిలీ ఏమైపోయిందో, ఏమో?" అని నిట్టూర్చింది.

రాజు ఆశ్చర్యపడి, "ఇక్కడ కన్న నీ పాకలోనే నీకు బాగున్నదా?" అని అడిగాడు.

" అది కాదు, నాయనా! నా మనవరాలు నా కోసం వస్తే నా ఇంటికే వస్తుంది. నేను లేకపోతే ఏ మైపోయా ననుకుంటుందో, ఏమో ?" అన్నది ముసలమ్మ.

ముసలిది మనవరాలి కోసం తపించి పోతున్న దనుకుని, ఆ మనవరాలిని తీసుకు రమ్మని తన భటులను పంపించాడు రాజు. రాజాజ్ఞ అయిందనగానే మనవరాలు తన బిడ్డతో సహా వచ్చింది.

రాజభవనమూ, అక్కడి వాతావరణమూ చూస్తే మనవరాలికి ముళ్ళ మీద ఉన్నట్టని పించింది. ఏం చేస్తే ఏం తప్పో ? చంటి బిడ్డ ఏడిస్తేనే రాజభవనానికి అపచారం జరిగేటట్టున్నది. ముసలిదానికూడా ముళ్ళ మీద ఉన్నట్టే ఉన్నది. ఆమె మనవ రాలిని అడుగడుగునా, " అలా చెయ్యకు. అటుగా వెళ్ళకు," అని హెచ్చరిస్తూ వచ్చింది.

రెండు రోజులు రెండు యుగాలుగా గడిపి మనవరాలు, " నా కింటి మీద బుద్ధిమళ్లింది. నేను పోవాలి," అని, ముసలమ్మ ఇచ్చిన రూపాయల సంచీ తీసుకుని, బిడ్డతో సహా వెళ్ళిపోయింది.

ఆ తరవాత ముసలమ్మకు మరింత దిగులు పట్టుకున్నది. ఆమెకు రాజభవనం



నరకంలా గున్నది. తాను రాజభవనంలో ఉండటం చేతనే గదా, రాకరాక వచ్చిన మనవరాలు రెండు రోజులన్నా ఉండ కుండా వెళ్ళిపోయింది ? తాను తన సొంత ఇంట్లోనే ఉన్నట్టయితే ఇలా జరిగి ఉండునా?

రాజు మళ్ళీ వచ్చి చూసి, " ఏం, అవ్వా, ఇంకా ఏదో దిగులుగానే వున్నట్టు కనబడు తున్నావే ?" అన్నాడు.

" దిగులు కే ముంది, నాయనా ? మా వూళ్ళో ఉంటే ఏదో ఆ పనీ, ఈ పనీ చేసు కునేదాన్ని. ఇక్కడ చెయ్యటాని కే ముందీ? ఏమీ లేదు. తినటమూ, కూర్చోవటమూ— సోమరి బతుకు !" అన్నది ముసలమ్మ.

పుట్టినది మొదలు ఏదో పనీ పాటా ఉండే మనిషికి సోమరిగా బతకటం కష్టమే ననిపించి రాజు ముసలమ్మను తన కూతురి దగ్గిర పెట్టి, "ఆ అవ్వకు చిన్న చిన్న పనులేవైనా చెప్పి చేయించుకుంటూ ఉండు. ఊరికే ఉంటే ఆ మనిషికి తోచదల్లే ఉంది," అన్నాడు.

రాజకుమార్తె దగ్గిర ముసలమ్మకు ఇంకా బాగా జరుగుతున్నది. కాని ఆమెకు ఇప్పుడు ఇంటి బెంగ మరీ జాస్తి అయింది. తన ఇల్లు తనకు ఇంకా దూరమైనట్టు తోచింది. ఆమె అస్తమానమూ బొడ్డు నుంచి ఇంటి తాళం చెవి తీసి చూసుకుని, కంట తడి పెట్టుకో సాగింది.

"అవ్వా, ఏమిటో విచారంగా ఉన్నట్టున్నావే?" అని రాజకుమార్తె, చూసి చూసి, అడిగింది.

"అమ్మా, నన్ను ఒక్కసారి మా ఇంటికి పంపమని రాజుగారితో చెబుతావా? నాలుగే నాలుగు రోజు లుండి వస్తాను," అన్నద ముసలమ్మ.

తన కుమార్తె ఈ మాట చెప్పగానే రాజు ముసలమ్మను ఆమె ఇంట దిగబెట్టమని తన భటులతో చెప్పి, ఒక భటుడి వేషంలో తాను కూడా వచ్చి, ముసలమ్మ ఏం చేస్తుందో చూశాడు.

ముసలిది మేనా దిగి గబగబా ఇంటి తాళం తీసి, చీపిరికట్టతో ఇల్లంతా చిమ్మి, నట్టింట చింకి చాప పరుచుకుని, దానిమీద కాళ్ళు చాచి పడుకుని, "హమ్మయ్యా! ఆ నరకం నుంచి ఎంత కాలానికి విముక్తి దొరికిందిరా, భగవంతుడా!" అని పెద్దగా అనుకున్నది.

కష్టమో, సుఖమో, ఆ ముసలమ్మకు కావలసింది తన స్వేచ్ఛా, తన ఇల్లూ, తన పనీ, తన జీవితమూ అని గ్రహించుకుని రాజు తన దారిన తాను రాజధానికి వెళ్ళిపోయాడు.





# కాకుల స్నేహం

ఒక గ్రామంలో సారంగు డని ఒక కుర్రవాడుండేవాడు. వాడికి చిన్నతనంలోనే తల్లి పోయింది. సారంగుడు పదేళ్ళవాడై ఉండగా వాడి తండ్రి గుడ్డివాడయాడు. వాళ్ళు నిరుపేదలు. వాళ్ళ కొక చిన్న అవరణా, అందులో ఒక పూరిపాకా తప్ప ఇంకేమీ ఆధారం లేదు.

తండ్రి గుడ్డివాడై ఏ పనీ చెయ్యలేని స్థితిలో ఉండటం చేత సారంగుడే బయటికి వెళ్ళి, ఎక్కడైనా రెక్కల కష్టం చేసి, డబ్బులు సంపాదించి, ఆ డబ్బుతో సజ్జలు కొని, పిండి చేసి, రొట్టెలు కాల్చి, తండ్రికి పెట్టి, తాను తిని, మిగిలినవి కాకులకు వేస్తూ ఉండేవాడు.

సారంగుడికి ప్రపంచంలో ఉన్న స్నేహితులు ఆ కాకులే. ఆ కాకులంటే వాడికి ప్రాణం. అసలే పేదవాడు, దానికి తోడు ఇతర పిల్లలతో చేరి ఆటపాటలలో పొద్దుపుచ్చటానికి వాడికి అవకాశం కూడా లేదు. అందుచేత, రోజూ భోజనాల వేళకు వచ్చి తమ ఇంటి పిట్ట గోడ మీద కూర్చునే కాకులను వాడు ఎంతో ప్రేమగా చూసుకుని, తాను కడుపు నిండా తినకుండా అయినా నాలుగు తుంపులు మిగిల్చి వాటికి వేసేవాడు.

ఒక రోజు సారంగుడికి కొద్ది డబ్బులే దొరికాయి. ఆ రోజు వాడు చేసిన రొట్టెలన్నిటినీ వాడి తండ్రే తినేశాడు. సారంగుడికి గాని, కాకులకు గాని ఒక్క తుంపు కూడా మిగల లేదు. తనకు రొట్టెలు మిగలనందుకు వాడు విచారించ లేదు గాని, రోజూ ఎంతో ఆశతో వచ్చే కాకులకు చెయ్యి దులపలేకపోయానే అన్న విచారం వాణ్ణి బాధించింది.

వాడు బయటికి వచ్చి చూసేసరికి, రోజులాగే పిట్ట గోడ మీద కాకులన్నీ బారు తీరి

పి. హరినాథం




కూర్చున్నాయి. వాటిని చూడగానే సారంగుడికి దుఃఖం పొంగి వచ్చింది. వాడు ఆ కాకులతో, "ఏం చేసేది, ఈ రోజు మీకు తిండి ప్రాప్తిలేదు," అన్నాడు.

వాడి మాటలు అర్థం చేసుకున్నట్టుగా కాకులన్నీ "కా, కా," అని అరుస్తూ వెళ్ళిపోయాయి. కొద్ది సేపట్లో ఒక కాకి తన ముక్కున ఏదో కరుచుకుని వచ్చి, దాన్ని సారంగుడి ముందు పడేటట్టుగా జారవిడిచి ఎగిరి పోయింది.

సారంగుడు వంగి దాన్ని తీసుకుని చూసి నిర్ఘాంతపోయాడు. అది రాజముద్రికలాగున్నది. వాడు కంగారు పడుతూ లోపలికి పోయి, "నాన్నా, కాకి తెచ్చి పడేసింది. ఇది చూడగా రాజముద్రికలాగున్నది. ఏం చెయ్యాలి?" అని తండ్రి నడిగాడు.

తండ్రి కూడా కంగారుపడి, "రాజముద్రికను ఒక్క క్షణం కూడా దగ్గిర ఉంచుకోరాదు, నాయనా! పెద్ద నేరం! నువు రాజధాని దాకా ఎక్కడ పోగలవు? ఈ ఊరి కొత్వాలు కిచ్చి, దాన్ని రాజుగారికి చేర్చమని చెప్పి రా!" అన్నాడు.

సారంగుడు కొత్వాలు దగ్గిరికి పోయి, రాజముద్రికను అతని కిచ్చి, అది ఎట్లా తనకు దొరికినదీ చెప్పాడు.

"రాజముద్రికను ఎవరో దొంగిలించారనీ, అది ఎవరి దగ్గిర ఉంటే వారిని బంధించి తీసుకు రమ్మనీ రాజుగారి ఆజ్ఞ. అందుచేత నిన్ను నేను బంధించి రాజధానికి తీసుకు పోక తప్పదు," అన్నాడు కొత్వాలు కోపంగా.

కొత్వాలు ఇద్దరు భటులను పిలిచి, సారంగు చేతులను తాడుతో బంధించి, "వీణ్ణి తీసుకుని మీరు రహదారిన రాజధానికి బయలుదేరి నడుస్తూ ఉండండి. నేను కాస్త పొద్దువాలినాక గుర్రం మీద వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను," అని చెప్పాడు.

భటులు సారంగుణ్ణి వెంటబెట్టుకుని రాజధానికి బయలుదేరారు. వాళ్ళు సగం దారి నడిచేసరికి సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. భటులు ఒక చెరువు సమీపంలో ఆగి, హాయిగా స్నానాలు చేసి, తాము తెచ్చుకున్న ఆహారం తిని, చెరువు మీది నుంచి వచ్చే చల్లని గాలికి చెట్ల కింద పడుకుని నిద్రపోయారు.

ఇంతలో ఎక్కడి నుంచో కాకుల దండు వచ్చి పడింది. ఒక్క కాకి కూడా అరవ లేదు. వాటిలో కొన్ని కాకులు సారంగుణ్ణి సమీపించి, వాడి చేతికి కట్టిన తాళ్ళను అన్ని వైపులకూ గుంజి, కట్లు విడిపించి, ఎలా వచ్చాయో అలాగే నిశ్శబ్దంగా ఎగిరి వెళ్ళిపోయాయి.

సారంగుడు మొదట ఇంటికి తిరిగి పోదా మనుకున్నాడు. కాని అందువల్ల లాభం ఉండదని తోచింది. వాడు రహదారి విడిచి పెట్టి, అడ్డదారిన రాజధానికి చేరుకున్నాడు; తిన్నగా రాజభవనానికి వెళ్ళి రాజుగారి దర్శనం కావాలన్నాడు. అదృష్టవశాన రాజు వాణ్ణి చూడటానికి సమ్మతించాడు.

సారంగుడు రాజుగారి కాళ్ళ దగ్గర సాష్టాంగపడి, తనకు కాకి మూలాన ముద్రిక దొరకటమూ, దానిని తాను కొత్వాలు కిచ్చి నప్పుడు కొత్వాలు తనను బందీని చెయ్య



టమూ, కాకులే తనను విడిపించటమూ వివరంగా చెప్పాడు.

రాజు అంతా విని, "నీకు కాకులు చేసిన సహాయంలో నూరో వంతయినా మనిషి చేసినట్టు కనబడదే!" అని తన ఖజానా నుంచి నూరు మొహరీల సంచీ తెప్పించి కుర్రవాడి కిప్పించాడు.

సారంగుడు ఆనందబాష్పాలు రాల్చి రాజుగారి వద్ద సెలవు పుచ్చుకుని బయలు దేర బోయాడు. కాని రాజుగారు వాణ్ణి ఆపి, "ఆ డబ్బుతో ఒంటరిగా ఎలా పోతావు? కొంచెం ఆగు. నీకు మీ గ్రామం కొత్వాలునే అంగరక్షకుడుగా ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

ఇంతలోనే కొత్వాలూ, ఇద్దరు భటులూ వచ్చి చేరారు. కొత్వాలు రాజాజ్ఞతో రాజు గారి వద్దకు వచ్చి, నమస్కారం చేస్తూ, "మహారాజా, ముద్రికను సంపాదించాను. దొంగ తప్పించుకు పోయాడు. వాణ్ణి త్వరలోనే పట్టి—" అని మాట మధ్యలోనే సారంగుణ్ణి చూసి గుడ్లు వెళ్లబెట్టాడు.

"నీకు కొంచెం కూడా జ్ఞానం ఉన్నట్టు లేదు. ముద్రికను సంపాదించినందుకు ఈ కుర్రవాడికి ఇదివరకే బహుమానం ముట్టింది. ఈ కుర్రవాణ్ణి క్షేమంగా ఇంటి దగ్గిర చేర్చే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను. ఎవరు దొంగో, ఎవరు కాదో తెలుసుకోలేని నువు కొత్వాలుగా ఉండదగవు. అయినా ఈ సారికి నీ తప్పు కాచాను. ఇక పద!" అన్నాడు రాజుగారు.

రాజుగా రిచ్చిన డబ్బుతో సారంగుడు ఒక చిన్న మేడ వేసుకుని, పొలం కూడా కొనుక్కుని తండ్రితో సుఖంగా జీవించాడు. అతని కథ త్వరలోనే అందరికీ తెలిసింది. సారంగుడి మేడను అందరూ కాకిమేడ అనే వారు. దాని మీద అస్తమానమూ కాకు లుండేవి. ప్రతిరోజూ వాటికి పుష్కలంగా తిండి ముట్టుతూ ఉండేది.





# మాటకారి మల్లన్న

ఒక ఊళ్ళో "ఆరు మాటలవాడు" ఒకడు ఉండేవాడు. పొరుగూళ్ళో "మూడు మాటల వాడు" ఒకడున్నాడని తెలిసి, ఆరు మాటల వాడు అతన్ని చూసి, మూడు మాటలు మాట్లాడి, మూడు మిగుల్చు కొద్దామను కుని, ఒకనాడు గుర్రమెక్కి పొరుగూరికి బయలుదేరాడు.

దారిలో ఒక పొలంలో, మూడు మాటల వాడి కొడుకు మల్లన్న అనేవాడు దున్నుతూ కనిపించి, ఆరు మాటలవాణ్ణి పలకరించి, అతను పోతున్న పని తెలుసుకున్నాడు. ఈ ఆరుమాటలవాణ్ణి తన తండ్రి దగ్గిరికి పోనివ్వరా దనిపించింది మల్లన్నకు. ఎందుకంటే ఆరు మాటలవాడి దగ్గిర మూడు మాటలవాడు లోకువ అయిపోతాడు.

అందుచేత వాడు, "ఏమయ్యా, ఆరు మాటల వాడా? మా నాన్న అయిన మూడు మాటలవాడు ఇంట్లో లేడు. ఆకాశం పగిలి పోతే, నల్లినరమూ, ఎర్రచీమ తోలూ తీసుకుని, కోమటివారి గునపంతో కుట్ట బోయాడు," అన్నాడు.

"కొడుకు మాటలే అంతు బట్టటం లేదే ఇక తండ్రి ఎంతటి వాడో!" అనుకుని ఆరు మాటలవాడు వచ్చిన దారిపట్టి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి మల్లన్న భోజనాల దగ్గిర, మూడు మాటలవాడితో ఆరు మాటలవాడు రావటమూ, తాను వాణ్ణి తన మాటకారి తనంతో బెదరగొట్టి, వెనక్కి పంప టమూ చెప్పాడు.

ఆరుమాటలవాడు తన కోసం వస్తే తన కొడుకు తిప్పి పంపేశాడని మూడుమాటల వాడికి చాలా కోపం వచ్చింది. ఆ రాత్రి తన కొడుకు నిద్రపోయేటప్పుడు మూడు మాటలవాడు వాణ్ణి మంచంతో సహా ఎత్తు కుని ఊరి బావిలో పారెయ్యటానికి బయలు

ఎస్. శివరామబ్రహ్మం

దరాడు. మల్లన్నకు మెళుకువ వచ్చింది. వాడు తండ్రి ఉద్దేశం గ్రహించి, దారిలో చేతి కందిన మర్రిఊడలు పట్టుకుని మర్రి చెట్టు ఎక్కిపోయాడు. మూడు మాటలవాడు ఉత్త మంచాన్ని బావిలోకి గిరవాటు వేసి, ఇంటికి తిరిగి వచ్చి, నిశ్చింతగా పడుకుని నిద్రపోయాడు.

మూడు మాటలవాడు తెల్లవారి లేచేసరికి కొడుకు ఇంటి ముందు, గొడ్లు తొక్కిన చెత్త తీసేస్తూ ప్రత్యక్షమయాడు.

"నువ్విక్కడున్నావా! బావిలో నుంచి ఎట్లా బయట పడ్డావురా?" అని తండ్రి మల్లన్నను అడిగాడు.

"కప్పకు కళ్ళెం వేసి, 'లక్, లక్' మంటూ వచ్చా, నాన్నా," అన్నాడు మల్లన్న.

మర్నాడు రాత్రి మల్లన్న నిద్రపోతుండగా, తండ్రి వాణ్ణి మంచంతో సహా ఎత్తుకుపోయి, మరింత దూరాన ఉన్న చెరువులో గిరవాటు వేశాడు.

అయితే ఈ సారి కూడా మల్లన్న మర్రి ఊడలు పట్టుకుని, చెట్టెక్కి, తప్పించుకుని, మర్నాడుదయం తండ్రికి మామూలుగానే ప్రత్యక్షమయాడు.

"చెరువులో నుంచి ఎట్లా బయట పడ్డావురా?" అని తండ్రి కొడుకును ఆశ్చర్యంతో అడిగాడు.

"తెలివితేటలుండాలి గాని, అదో లెక్కా, నాన్నా? నేను చెరువులో పడగానే నీటి మీదికి వచ్చి చూశాను. చెరువుకు అటో మనిషీ, ఇటో మనిషీ నిలబడి మాట్లాడుకుంటున్నారు. ఇద్దరి మాటలూ ముడివేసి మాటల ధ్వనిని పట్టుకుని ఒడ్డుకు వచ్చేశాను," అన్నాడు మాటకారి మల్లన్న.

మూడు మాటలవాడికి తన కొడుకు ప్రజ్ఞ చూసి ముచ్చట వేసింది. అందుచేత అతను ఆ నాటి నుంచీ మల్లన్న మీద ఆగ్రహం వదిలేసి, అతడంటే చాలా ప్రేమగా ఉంటూ వచ్చాడు.





# ముగ్గురుదేవుళ్లు

ఒక రాజ్యంలో ఒక నిర్జన ప్రదేశంలో మూడు దేవతా విగ్రహాలు వెలిశాయి. మూడు విగ్రహాలూ ఒక్కటిగానే ఉండి, మూడింటికీ తేడా తెలిసేది కాదు. ఆ విగ్రహాలుండే దిక్కుగా వెళ్లే పామర జనం వాటికి దణ్ణాలు పెట్టుకుని తమ మనసులో ఉండే కోరికలను పైకి అనేవారు. అప్పుడు ఆ విగ్రహాలలో ఏదో ఒకటి జవాబు చెప్పేది.

"దేవుళ్లు మాట్లాడుతున్నారు! ఎవరే ప్రశ్న అడిగినా సమాధానం చెబుతున్నారు!" అని జనం గొడవగా చెప్పుకోసాగారు. ఈ దేవుళ్ల వార్త కార్చిచ్చు లాగా ఎన్నో ఆమడలకు పాకింది.

ఈ సంగతి తెలియగానే రాజుగారు ఆ దేవుళ్ళు వెలిసిన చోట ఒక గుడినీ, ధర్మకర్తనూ ఏర్పాటు చేసి, దేవదర్శనం కోరి వచ్చినవారికి పన్ను వేసి, రోజూ కొన్ని వేల రూపాయలు సంపాదించసాగాడు.

తీర్థప్రజగా జనం వచ్చి దేవుళ్ళను ప్రశ్నలడుగుతున్నారు. దేవుళ్ళు ప్రతి ప్రశ్నకూ సమాధానం చెబుతూనే ఉన్నారు. కాని వారు చెప్పే సమాధాలలో కొన్నే నిజమవుతున్నాయి. కొన్ని అబద్ధా లవుతున్నాయి.

క్రమంగా యాత్రికుల తాకిడీ, దానితో బాటు రాజుగారి రాబడీ తగ్గసాగింది.

రాజు ధర్మకర్తను పిలిపించి, "దేవుళ్ల పట్ల ప్రజలకు విశ్వాసం సన్నగిల్లటానికి ఏమిటి కారణం?" అని అడిగాడు.

"మహారాజా, నాకు చూడగా ఒకటి తోస్తున్నది. ముగ్గురు దేవుళ్లూ నిజాయితీ గలవాళ్ళు కారు. వారిలో ఒక్కడే నిజాయితీ గలవాడు, సత్యవాది. మిగిలిన ఇద్దరిలో ఒకడు కచ్చితంగా అసత్యవాది. మూడోవాడు యుక్తివాది—అంటే అతడు చెప్పేది నిజం కావచ్చు, అబద్ధం కావచ్చు," అన్నాడు ధర్మకర్త.

ఆర్. గున్నేశ్వరరావు



"అందులో సత్యవాది ఎవడో కూడా నిర్ణయించలేక పోయావా? జనానికి ఆ దేవుళ్ల రహస్యం తెలియబరచి, వాళ్ళకు సంతృప్తి చెయ్యవచ్చు గదా!" అన్నాడు రాజు.

"అదే సాధ్యం కాకుండా ఉన్నది, మహారాజా. ప్రజలు దేవుళ్ళను రహస్యాలడగటానికి ఒంటరిగా లోపలికి పోతారు. తిరిగి వచ్చేటప్పుడు ఏ దేవుణ్ణి తాము అడిగినదీ సరిగా చెప్పరు. ఏ దేవుడు చెప్పినది అబద్ధమైనదీ తెలుసుకోవటం నాకు అసాధ్యంగా తోస్తున్నది," అన్నాడు ధర్మకర్త.

వెంటనే రాజు, "ముగ్గురు దేవుళ్ళలో ఎవరు సత్యవాదో, ఎవరు అసత్యవాదో, ఎవరు యుక్తివాదో నిర్ధారణ చేసిన వారికి జాగీరు బహుమానం లభిస్తుంది," అని చాటింపు వేయించాడు.

రాజధాని నుంచి చాలామంది వచ్చి ప్రయత్నించారు, కాని ఎవరి వల్లా కాలేదు. ఒకనాడు ఒక ముసలి కాపు, ధర్మకర్త దగ్గిరికి వచ్చి, "ఆ దేవుళ్ళ సంగతి నేను తేలుస్తాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి గుడి లోపలికి వెళ్ళారు.

కాపు మొదటి దేవుడి దగ్గిరికి వెళ్ళి, "అయ్యా, నీ పక్కనున్న దేవుడు ఎవరు?" అని అడిగాడు,

"సత్యవాది దేవుడు," అన్నాడు మొదటి దేవుడు. తరవాత కాపు రెండో దేవుడి వద్దకు వెళ్ళి, "అయ్యా, నువ్వెలాటి దేవుడివి?" అని అడిగాడు.

"నేను యుక్తివాదిని," అన్నాడు రెండో దేవుడు.

కాపు మూడో దేవుడి వద్దకు వెళ్ళి, "అయ్యా, నీ పక్కనున్న దేవు డెవరు?" అని అడిగాడు.

"అసత్యవాది దేవుడు," అన్నాడు మూడో దేవుడు.

కాపు ఇవతల కొచ్చి ధర్మకర్తతో, "అందరి సంగతీ తెలిసిపోయింది. పదండి,

రాజుగారి దగ్గిరికి,'' అన్నాడు. ధర్మకర్త తెల్లమొహం వేసి, "నా కేమీ తెలియలేదే!" అన్నాడు ఆశ్చర్యంగా.

ఇద్దరూ కలిసి రాజుగారి దగ్గిరికి వెళ్లారు. కాపు రాజుతో, "మహారాజా, మొదటి దేవుడు యుక్తివాది, రెండో దేవుడు అసత్యవాది, మూడో దేవుడు సత్యవాది," అంటూ తాను దేవుళ్ళను వేసిన ప్రశ్నలూ, ఆ ప్రశ్నలకు దేవుళ్లిచ్చిన సమాధానాలూ చెప్పాడు.

"ఆ సమాధానాల వల్ల నా కేమీ తెలియటం లేదే? అంతా అయోమయంగా ఉన్నది," అన్నాడు రాజు.

కాపు ఇలా అన్నాడు:

"కొంచెం జాగ్రత్తగా ఆలోచించండి. మొదటి దేవుడు తన పక్కనున్న వాణ్ణి సత్యవాది అన్నాడు. కనక మొదటి దేవుడు నత్యవాది వాడు; అయితే అసత్యవాది కావాలి, లేదా యుక్తివాది కావాలి. అతడు నిజంగా సత్యవాది అయితే మరొకణ్ణి సత్యవాది అనడు. ఇక రెండో వాడు కూడా సత్యవాది కాడు. సత్యవాది అయినట్టయితే తాను యుక్తివాది నని చెప్పటం అబద్ధమవుతుంది. కనక అతను కేవలమూ అసత్యవాది అయి ఉండాలి. అతను నిజంగా యుక్తివాదే అయి ఉంటే యుక్తివాది నని నిజం చెప్పడు. ఒక వేళ యుక్తివాది ఒకప్పుడు నిజం కూడా చెప్పవచ్చుగదా అనవచ్చు. కాని సత్యవాదిగా రుజువయిన మూడో దేవుడు చెప్పిన దాన్నిబట్టి మధ్య ఉన్నవాడు అసత్యవాది అని తేలుతున్నది. అందుచేత మధ్యవాడు నమ్మకంగా అసత్యవాది కావాలి. అంటే మొదటి వాడు యుక్తివాది అన్నమాట. యుక్తివాది గనకనే తన పక్కన ఉన్నవాణ్ణి సత్యవాది అని చెప్పి, ఆ దేవుడికి సంతోషం కలిగించ యత్నించాడు."

రాజు కాపు తెలివికి మెచ్చుకుని అతనికి పెద్ద జాగీరు ఇప్పించాడు.







# స్తోత్రార్హులెవరు?

ఒకప్పుడు కురుదేశంలో భయంకరమైన కరువు వచ్చింది. ఆకలి బాధకు తట్టుకో లేక అక్కడి ప్రజలు భార్యాబిడ్డలతో చెల్లాచెదరుగా అన్ని దిక్కులకూ బయలు దేరి వెళ్ళిపోయారు.

అలా బయలుదేరిన వారిలో చాక్రాయణ గోత్రం వాడైన ఉషస్తి అనే గొప్ప జ్ఞాని కూడా ఉన్నాడు. ఆయన వేదరహస్యాలు తెలిసినవాడు. ఆయన తన భార్య అయిన ఆటికి అనే ఆమెను వెంట బెట్టుకుని, ఆకలి బాధను ఎలాగో భరిస్తూ చాలా దూరం నడిచి ఒక గ్రామానికి చేరుకున్నాడు.

అక్కడ ఒక మావటివాడు ఉలవ గుగ్గిళ్ళు తింటూ ఉషస్తికి కనిపించాడు.

ఆకలి దహించుకు పోతున్న ఉషస్తి ఆ మావటి వాణ్ణి సమీపించి, "అయ్యా, ఆ ఉలవలు కాసిని నాకు పెడతావా?" అని అడిగాడు.

"అయ్యా, ఇవి ఎంగిలి అయి పోయాయి. నీకు పెడదామంటే నా దగ్గిర వేరే ఉలవ గుగ్గిళ్ళు లేవు కూడానూ," అన్నాడు మావటి.

"ఎంగిలి అయితే అయిందిలే. వాటినే నాకు పెట్టు," అన్నాడు ఉషస్తి.

మావటి ఉషస్తికి రెండు పట్టెళ్ళు ఉలవ గుగ్గిళ్ళిచ్చాడు. ఉషస్తి వాటిలో కొంత తిని తన ఆకలిబాధ తీర్చుకున్నాడు. మిగిలినవి మూట కట్టుకున్నాడు.

మావటివాడు ఉషస్తికి తాను తాగే చెంబు నుంచి నీరు ఇవ్వబోయాడు.

ఉషస్తి ఆ నీరు నిరాకరించుతూ, "అది ఎంగిలి నీరు. నాకు వద్దు," అన్నాడు.

"నే నిచ్చిన ఉలవలు తింటివే. అవి మాత్రం ఎంగిలివి కావా?" అని మావటి వాడు ఉషస్తిని ఆశ్చర్యంతో అడిగాడు.

"ఆ ఉలవలు తినకపోతే ప్రాణాలే పోయి ఉండేవి. తిండి ఎక్కడా దొరకటం

లేదు. మంచినీరు ఎక్కడబడితే అక్కడే దొరుకుతున్నది. ఇంకో చోటికి పోతాను," అంటూ ఉషస్తి వెళ్ళిపోయాడు.

ఆయన తాను తినగా మిగిలిన ఉలవ గుగ్గిళ్ళను పట్టుకుపోయి తన భార్య అయిన ఆటికి కిచ్చాడు. ఆమెకు ఆకలి లేక పోయింది. అందుచేత వాటిని దాచి ఉంచింది.

ఉషస్తి మర్నాడు ఉదయమే లేచి తన భార్యతో, "తినటాని కేమైనా ఉన్నదా? కడుపులో కాస్త ఎత్తు పడితే వెళ్ళి ఏమైనా ఆర్జించుకుని వస్తాను. ఈ దగ్గరలోనే ఎవరో రాజు యాగం చేస్తున్నాడట," అన్నాడు.

"నిన్న మీరు మిగుల్చుకున్న ఉలవ లున్నాయి. వాటిని తిని యజ్ఞానికి వెళ్ళి రండి," అన్నది ఆటికి తన భర్తతో.

ఉషస్తి, ఎంగిలితో బాటు చద్ది కూడా అయిన ఆ ఉలవలను తిని బలం తెచ్చు కుని, రాజు యాగం చేసే చోటికి వెళ్ళి, యాగశాల ప్రవేశించి కూర్చున్నాడు. అక్కడ, సామవేద స్తోత్రాలు చదివి యాగం చేయించే ప్రస్తోతా, ఉద్గాతా, ప్రతిహర్తా స్తోత్రాలు ప్రారంభించ బోతున్నారు.

ఉషస్తి ప్రస్తోతను చూసి, "నువు ఏ దేవతను స్తోత్రం చెయ్యబోతున్నావో, ఆ దేవతను గురించి తెలుసుకోకుండా



స్తోత్రం చేశావంటే నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

ఆయన ఉద్గాత తోనూ, ప్రతిహర్త తోనూ కూడా ఈ మాటలే చెప్పాడు.

స్తోత్రాలు ప్రారంభించబోతున్న ముగ్గురు ఋత్విక్కులూ బిత్తరపోయి ఒకరి మొహా లొకరు చూసుకున్నారు.

తరవాత ప్రస్తోత ఉషస్తితో, "అయ్యా, నేను స్తోత్రం చెయ్యవలసిన దేవత ఎవరు? తెలియక స్తోత్రం చేస్తే నా తల పగిలి పోతుందని తమరు సెలవిచ్చారు!" అని అడిగాడు.

"నువు స్తోత్రం చెయ్యవలసిన దేవత ప్రాణం. సమస్త భూతాలూ ప్రాణం నుంచే కలుగుతున్నాయి, ప్రాణంలోనే లయిస్తు న్నాయి," అన్నాడు ఉషస్తి.

తరవాత ఉద్గాత కూడా, "నేను స్తోత్రం చెయ్యవలసినది ఏ దేవత?" అని ఉషస్తిని అడిగాడు.

"సూర్యుడు. ఆ సూర్యుడి కారణం గానే అన్ని భూతాలూ పుడుతున్నాయి!" అన్నాడు ఉషస్తి. ప్రతిహర్త కూడా మిగిలిన ఇద్దరూ అడిగినట్టే అడిగాడు.

"నువు స్తోత్రం చెయ్యవలసిన దేవత అన్నం. సమస్త ప్రాణులూ అన్నం మూలానే జీవిస్తున్నాయి," అన్నాడు ఉషస్తి.

ఈ సంభాషణ అంతా వింటున్న రాజు, "అయ్యా, తమ రెవరో నాకు తెలియ జెప్పండి," అని ఉషస్తి నడిగాడు.

"నాది చాక్రాయణ గోత్రం. నా పేరు ఉషస్తి," అని ఉషస్తి జవాబు చెప్పాడు.

"తమరి సంగతి తెలియక నేను ఇతరులను ఋత్విక్కులుగా పెట్టుకున్నాను. తమరు కూడా వారితో కలిసి ఈ యాగం జరిపించాలి," అని రాజు ఉషస్తిని వేడుకున్నాడు. ఉషస్తి అలాగే చేశాడు. యాగం పూర్తి అయాక రాజు ఉషస్తికి మిగిలిన ఋత్విక్కులతో సమంగా ధనం ఇచ్చాడు.





# కృష్ణావతారం

ఒకనాటి రాత్రి కృష్ణుడు తన తండ్రి ఇంట ఉండి ఒక ఆలోచన చేశాడు. తన వారికి వైభవోపేతమైన ద్వారకానగరం ఏర్పడింది. కాని వారికి జీవనం సుఖప్రదంగా జరిగే ఒనరు ఏర్పడలేదు. అందుచేత అతను శంఖనిధిని తలుచుకున్నాడు. వెంటనే శంఖనిధి ప్రత్యక్షమై, చేతులు మోడ్చి నమస్కరించి, "స్వామీ, ఎందుకు నన్ను స్మరించావు? నీ ఆజ్ఞ ఏమిటో తెలిస్తే నిర్వర్తిస్తాను," అన్నది.

"నిధిదేవతా, దరిద్రుడు చచ్చినవాడితో సమానం. నా వారిలో దీనులూ, అనాథులూ, ఆర్తులూ ఉండగా చూసి సహించలేను. అన్ని ఇళ్ళలోనూ సంపత్సమృద్ధి ఉండేటట్టు చూడు," అన్నాడు కృష్ణుడు.

"చిత్తం," అని శంఖనిధి వెళ్ళి మిగిలిన ఎనిమిది నిధులనూ కలుసుకుని, కృష్ణుడి కోరిక తెలిపింది. వెంటనే ద్వారక అంతటా నవనిధులూ వెలిశాయి. ఆ నగరంలో పేదవాడంటూ లేకుండా పోయాడు.

ఇదే విధంగా కృష్ణుడు మరొకసారి వాయుదేవుణ్ణి స్మరించాడు. వాయుదేవుడు వచ్చి కృష్ణుడికి నమస్కరించి నిలబడ్డాడు.

"వాయుదేవుడా, బలంలో నీకు చాలినవాడు ఎవడూ లేడు. నా కొక పని చేసి పెట్టాలి. అదేమిటంటే; ఇంద్రుడికి విశ్వకర్మ సుధర్మ అనే సభ చేసి యిచ్చాడు. మా యాదవులకు కూడలిగా ఒక మంచి సభ అవసరం. అందుచేత నువు ఇంద్రుడితో నా ఆజ్ఞగా చెప్పి, అతని అనుమతి

16. రుక్మిణీవివాహప్రయత్నం



మీద మా కా సభ తెచ్చిపెట్టు," అన్నాడు కృష్ణుడు. వాయుదేవుడు సరేనని దేవలోకానికి వెళ్ళి, దేవతలతో కృష్ణుడి కోరిక చెప్పి, వారి అంగీకారంతో సుధర్మ అనే సభాభవనాన్ని తెచ్చి, కృష్ణుడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా కృష్ణుడు సమస్త లోకాలలోనూ ఉన్న సర్వోత్తమమైన వస్తువులన్నీ తెప్పించి ద్వారకలో ఉంచాడు. కృష్ణుడు తాను పై నుండి పరిపాలన నడుపుతూ ఈ విధంగా ముఖ్యస్థానాలలో వారి వారిని నియమించాడు: రాజు ఉగ్రసేనుడు; కాశ్యపుడనే బ్రాహ్మణుడు పురోహితుడు; వికద్రుడు మంత్రి; వివిధ రాజ్యాంగ శాఖలు నిర్వహించటానికి పదిమంది యాదవ ప్రముఖులు, మంచి మేధావులైన వృద్ధులు నియమించబడ్డారు; దారుకుడు కృష్ణుడికి సారథి; అస్త్రవిద్యలో ద్రోణాచార్యుడితో సమానుడనదగిన సాత్యకి సేనాధిపతి.

ఈ విధంగా ప్రజల జీవితాన్ని వ్యవస్థాపించిన మీదట ద్వారక భూలోక స్వర్గంలాగా, అత్యంత వైభవంగా విలసిల్లింది. రైవతుడికి రేవతి అనే చక్కని కుమార్తె ఉన్నది. ఆమెను బలరాముడు పెళ్ళాడాడు. ఆ తరవాత కృష్ణుడికి వివాహమయింది. అదొక కథ.

వింధ్యపర్వతానికి దక్షిణంగా విదర్భదేశం ఉన్నది. అందులో కుండిననగరాన్ని భీష్మకుడనే రాజు పాలించేవాడు. ఆయనకు రుక్మి అనే కొడుకుండేవాడు. ఈ రుక్మి మేటి వీరుడు. అతను ద్రుముడనే రాజు వద్ద అనేక అస్త్రాలూ, పరశురాముడి నుంచి బ్రహ్మాస్త్రమూ పొందాడు. అతనికి మొదటి నుంచీ కృష్ణుడంటే ఎంతో మత్సరం ఉండేది.

ఆ రుక్మికి చెల్లెలు రుక్మిణి; గొప్ప తేజస్వతి, అసమాన సౌందర్యవతి. ఆమె



అందం మూడు లోకాలలోనూ ప్రఖ్యాతి పొందినది. ఆమె గొప్పతనాన్ని మూడు ముక్కలలో చెప్పవచ్చు; కృష్ణుడి ప్రేమకు పాత్రురాలయింది; మన్మధుడు ఆమె గర్భాన తిరిగి జన్మించాడు; మునీశ్వరులామెను దేవతగా పూజించారు. అంతకంటె ఇంకేం చెప్పాలి?

రుక్మిణిని గురించి తన ఆప్తులు చెప్పుకుంటూంటే కృష్ణుడు విన్నాడు. అదే విధంగా కృష్ణుణ్ణి గురించి నలుగురూ చెప్పుకుంటూంటే రుక్మిణి విన్నది. ఇద్దరి మనసులలోనూ ఒకరి మీద ఒకరికి అనురాగం పుట్టుకొచ్చింది. దాని ఫలితంగా ఇద్దరూ మన్మథావస్థలకు గురి అయి, వేదన అనుభవించారు.

"నేను వరించిన దాన్ని నాకు కాకుండా చెయ్యగలవాడు మూడు లోకాలలోనూ ఎవడున్నాడు?" అన్న ధైర్యంతో ఉన్నాడు కృష్ణుడు. రుక్మిణి మనస్సులో కృష్ణుడి ఆలోచన తప్ప మరొక ఆలోచన లేకుండా పోయింది.

కాని రుక్మికి కృష్ణుడంటే బొత్తిగా పడదు. "నందగోపుడి యింట పశువులను కాచిన వాడికీ నాకూ వంతేమిటి?" అన్న ధీమాలో ఉన్నాడతను.



ఇలా ఉండగా, మగధ దేశంలోని గిరివ్రజపురం నుంచి జరాసంధుడు రుక్మిణిని శిశుపాలుడికివ్వవలసిందని కబురు చేశాడు. శిశుపాలుడు జరాసంధుడి పెంపుడుకొడుకు. వాస్తవానికి అతని తండ్రి దమఘోషుడు. అతని తల్లి వసుదేవుడి తోబుట్టువైన శ్రుతశ్రవ. దమఘోషుడూ జరాసంధుడూ జ్ఞాతులు. అందుచేత దమఘోషుడు, జరాసంధుడు కోరిన మీదట తన నలుగురు కొడుకులలోనూ పెద్దవాడైన శిశుపాలుణ్ణి అతడికి పెంపుడిచ్చాడు.

శిశుపాలుడికి సునీధుడనే పేరు కూడా ఉన్నది.



జరాసంధుడు శిశుపాలుడికి రుక్మిణినిచ్చి పెళ్ళి చెయ్యమని కబురు చెయ్యగానే రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు సరేనన్నాడు. నిజానికి భీష్మకుడి ఉదేశం రుక్మిణిని కృష్ణుడికిస్తేనే బాగుంటుందని. కాని రుక్మికి కృష్ణుడంటే ద్వేషమని ఆయనకు తెలుసు. రుక్మి తన చెల్లెలిని శిశుపాలుడికే ఇవ్వాలన్న ఉదేశం బయటపెట్టాడు. కొడుకుకు ఎదురు చెప్పటం ఇష్టం లేక భీష్మకుడు సరేనన్నాడు.

తన కోరిక ఈడేరినందుకు జరాసంధుడు సంతోషించి తన ఆప్తులైన రాజులందరికీ శుభలేఖలూ, ఆహ్వానాలూ పంపాడు. అంగ, వంగ, కళింగ, పౌండ్ర, పాండ్య, కాశ, కరూశ మొదలైన రాజులనేకమంది పెళ్ళికి బయలుదేరారు. శిశుపాలుడికి తోడుగా వచ్చిన వారిలో కరూశ రాజకుమారుడు పౌండ్రక వాసుదేవుడూ, ఏకలవ్యుడి కొడుకు వీర్యవంతుడనేవాడూ, దంతవక్త్రుడి కొడుకు సువక్రుడనేవాడూ, ఇంకా అనేకమంది ఇతర రాజకుమారులూ ఉన్నారు. ఈ బలగాన్ని అంతనూ వెంట బెట్టుకుని జరాసంధుడు కుండిననగరానికి వచ్చాడు.

రుక్మి అనేక రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంట బెట్టుకుని ఎదురు వచ్చి, జరాసంధుడికి స్వాగతం తెలిపి, సమస్త మర్యాదలూ జరిపి, వచ్చిన వారందరినీ విడుదులలో ఏర్పాటు చేశాడు.

ముహూర్తాలు పెట్టేవాళ్ళు వచ్చి, మర్నాడే లగ్నం ఉన్నదన్నారు. వెంటనే ఆ విషయం నగరమంతటా చాటింపు వేశారు. రాజులందరూ తమ తమ హోదాలకు తగినట్టుగా సేనలను అలంకరించారు. శిశుపాలుడు పెళ్ళికొడుకై తన తోటి రాజకుమారుల మధ్య ఉల్లాసంగా ఉన్నాడు.

ఇక్కడ ఇలా ఉంటే అక్కడ ద్వారకకు నారదుడు వచ్చాడు. తెల్లని శరీరమూ, బంగారు రంగులో ధగధగా మెరిసే



జుట్టుముడీ, శరీరం మీద ధరించిన చర్మమూ, నెత్తిన నెమలిఈకల గొడుగూ, గాలి తాకుడుకు నాదం చేస్తున్న వీణా— ఈ అవతారాన్ని ద్వారకాపురవాసులు అతి వింతగా చూశారు.

నారదుడు వచ్చాడని లోపలికి కబురు రాగానే, ఉగ్రసేనుడూ, వాసుదేవుడూ, కృష్ణ బలరాములూ, మిగిలిన యాదవ ప్రముఖులూ ఎదురు వచ్చి, నారదుణ్ణి సుధర్మ సభాభవనానికి తీసుకు పోయి, ఒక బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, అర్ఘ్యపాద్యాలిచ్చి సత్కరించారు.

కృష్ణుడు అందరినీ కూర్చోమని, తాను కూడా కూర్చుని, చేతులు జోడించి, "నువు క్షేమంగా ఉన్నావా, నారదా? లోకాలకూ, దేవతలకూ క్షేమమే కదా? లోకాలన్నీ స్వేచ్ఛగా సంచరించే నీకు తెలియని దేముంటుంది? ఒకటి మాత్రం నిజం, నీ రాకకు ఏదో ప్రయోజనం ఉంటుంది. మా యాదవ వంశానికి ఏదో మంచి చెయ్యటానికే నువు వచ్చి ఉండాలి. నీ రాకవల్ల మేము ధన్యులమైనా మనటానికి ఎలాంటి సందేహమూ లేదు," అన్నాడు.

కృష్ణుడు చేసిన స్తోత్రపాఠాలకు ప్రీతుడై నారదుడు ఇలా అన్నాడు:



"నువ్వు తలచుకున్నంత మాత్రాన సమస్త ప్రాణులకూ క్షేమం కలుగుతుంది గదా, అన్ని యుగాలలోనూ నీ పాద సేవలోనే మునిగితేలే నా బోటి వాళ్ళ క్షేమం వేరే అడగాలా?"

ఇలా అని నారదుడు తన వీణను శ్రుతి చేసి, కృష్ణుడి సంతోషం కోసరం అత్యంత మధురంగా వాయించాడు; మీనావతారం దగ్గిర నుంచీ రామావతారం వరకూ గల అవతార కథలను పాటలుగా పాడాడు; తరవాత కృష్ణుడి బాలక్రీడలూ, పరాక్రమాలూ, కాళియమర్దనమూ, గోవర్ధనోద్ధరణా, కంసవధా మొదలైనవి ప్రస్తు





తించుతూ చక్కని పాటలు పాడాడు. ఆయన పాటలు విన్న వాళ్ళందరూ తన్మయత్వంలో ముణిగిపోయారు. నారదుడు ఆ పాటలలో కీర్తించిన కృష్ణుడు తమకు ఆత్మీయుడూ, నాయకుడూ అయినందుకు వాళ్ళు ఎంతో గర్వపడ్డారు. నారదుడు పాట చాలించి, వీణ పక్కన పెట్టెయ్యగానే, ఏ మేమి కబుర్లు చెబుతాడో వినాలని చాలా ఆతురతగా ఉన్నారు.

అప్పుడు కృష్ణుడు నారదుడి కేసి నవ్వుతూ చూసి, "బాబూ, ఒక్కటి కూడా తీరు పోనివ్వకుండా నేను చేసిన పనులన్నీ ఏకరు పెట్టావు, చాలు గాని నువ్విప్పుడు వచ్చిన పని ఏమిటో చెబుతావా? నువు ఊరికే వచ్చేవాడివి కావు," అన్నాడు.

అందుకు నారదు డిలా చెప్ప నారంభించాడు:

"దక్షిణ సముద్రతీరాన గోకర్ణ మనే మహా పుణ్యక్షేత్రం ఉన్నది. అక్కడ శంకరుడు దివ్య లింగరూపంలో ఉంటాడు. ఆ దేవుడి ముందు వీణ వాయించి, సంకీర్తన చేసి, భక్తితో అర్చన చేసి, అక్కడి నుంచి కదిలి కుబేరుణ్ణి చూద్దామని బయలుదేరాను. దారిలో కుండిన పురాన్ని ఏలే భీష్మకుణ్ణి చూశాను. అతను కూడా నన్ను చాలా గౌరవించి, సంతోష పెట్టాడు. అయితే అక్కడ నాకు జరాసంధుడు మొదలుకుని భూమి మీద ఉండే రాజులందరూ కనపడ్డారు. వీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారని భీష్మకుణ్ణి అడిగాను. అడిగితే, తన కుమార్తెను రుక్మిణిని చేది దేశపురాజైన శిశుపాలుడి కిచ్చి పెళ్ళి చేస్తూ అందరినీ ఆహ్వానించాననీ, రేపు ఉదయమే లగ్నమనీ చెప్పాడు. సరే, ఈ ముక్క నీ చెవిని వేసి పోదామని వచ్చాను."

నారదు డింకా ఇలా అన్నాడు:

"నీ మనసులో ఆ రుక్మిణిని నువు కోరుకున్నావు. ఆ భీష్మకుడేమో ఆ పిల్లను



నీ పగవాడి కిచ్చి పెళ్ళి చేయ సంకల్పించాడు. ఈ పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోతుంది. ఇలాగే జరిగినట్టయితే నీకు ఎంత అపకీర్తో చూడు. అందుచేత ఏం చేస్తావంటే, ఉగ్రసేన మహారాజును వెంటబెట్టుకుని, సాత్యకినీ, మిగిలిన యోధులనూ, సేనలనూ తీసుకుని ఈ పూటే బయలుదేరు. అక్కడికి వెళ్ళి, అక్కడ చేరిన రాజుల మూకలను చావబాది, సంతోషంగా ఆ పిల్లను తెచ్చుకో. నీ దగ్గిర సుదర్శనచక్రం ఉండగా అసాధ్యమేమిటి? ఇంకో సంగతి చెబుతాను విను. నేను ఆకాశమార్గాన అదృశ్యంగా ఉండి, ఆ రుక్మిణి లీలోద్యానంలో తన చెలికత్తెల మధ్య కూర్చుని కంట తడి పెట్టుకుంటూండటం చూశాను. నిన్నే తలుచుకోవటమూ, నిన్ను గురించే మాట్లాడటమూ, నిన్ను చూడటం కోసం ఆరాటపడటమూ తప్ప ఆ పిల్లకు మరో ప్రపంచమే ఉన్నట్టు లేదు. పాపం, ఆ పిల్ల స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. నున్నటి చెక్కిళ్ళు వడిలిపోయి, కన్నీరుతో తడిసి ఉన్నాయి. మెడలో ఒంటి పేట హారం తప్ప లేదు. పావిట చెదిరిపోయింది. జుట్టంతా రేగి ఉన్నది. ఊపిరి విడిచినప్పుడల్లా ప్రాణం పోతుందేమో నన్నట్టుగా తోస్తున్నది. శరీరం కంపించిపోతున్నది. చెలికత్తెలు ఎన్ని శైత్యోపచారాలు చేసినా ఏమీ ఫలితం లేకుండా ఉన్నది. వాళ్ళు నీ పేరు తప్ప మరెవరి పేరెత్తినా చచ్చిపోతానని చెలికత్తెలతో అంటున్నది. నిజంగా ఆమెను చూస్తే ఎంత కటికవాడికి కూడా గుండె కరిగిపోతుంది. సహజ కరుణా స్వభావుడివైన నువ్వు ఏ మాత్రమూ చూస్తూ ఊరుకోదగదు. పాపం, ఆ రుక్మిణి ప్రాణాలు ఎలాగైనా కాపాడు. కాపాడటం నీ వంటి వాడికి ధర్మం. ఇక నేను వెళ్ళివస్తాను."

ఈ మాట కాస్తా అని నారదుడు తన దారిన తాను వెళ్ళిపోయాడు.





# అరణ్యపురాణం

## 19

మర్కటులు మౌగ్లీని శిథిలాలకు చేర్చి, చాలా ఘనకార్యం చేశామని మహా మురిసి పోయారు. వాళ్ళకు మౌగ్లీ మిత్రులను గురించిన ఆలోచనే రాలేదు. మౌగ్లీ ఎన్నడూ నగరాన్ని చూసినవాడు కాదు. ఈ నగరం పూర్తిగా శిథిలమైనప్పటికీ అతనికి చూస్తుంటే మహా ముచ్చటగా ఉన్నది. చాలా కాలం క్రితం ఎవరో ఒక మహారాజు ఆ నగరాన్ని ఒక గుట్ట మీద నిర్మించాడు. నగర ద్వారా నికి వెళ్ళే దారి అనవాళ్ళింకా ఉన్నాయి. ద్వారం తలుపులు మాత్రం శిథిలమై, విరిగి పోయిన చెక్కలు తుప్పుపట్టిన బందుల కింకా వేళ్ళాడుతున్నాయి. రాతిగోడల నుంచి చెట్లు మొలిచాయి. బురుజు గోడలు విరిగి పడిపోయాయి. బురుజు గవాక్షాల నుంచి అడవి లతలు బయటికి వచ్చి వేళ్ళాడుతున్నాయి.

గుట్ట శిఖరాన ఉన్న రాజభవనం మీద కప్పు లేదు. ఆవరణలోనూ, జలయంత్రాల వద్దా ఉండిన చలువరాళ్ళు బద్దలైపోయి, ఎర్రగానూ, పచ్చగానూ అయిపోయాయి. నాపరాళ్ళ మధ్యగా గడ్డి, మొక్కలూ మొలుచుకొచ్చాయి. రాజభవనం నుంచి చూస్తే కప్పులు లేని ఇళ్ళవరసలు, నల్లగా, తేనె పట్టులోని గదుల్లాగా కనబడతాయి. నాలుగురోడ్లు కలిసే కూడలిలో ఉన్న విగ్ర హానికి ఇప్పుడే ఆకారమూ లేదు. రోడ్ల పక్కన ఉండిన బావులు గోతుల్లాగా అయి పోయాయి. శిథిలమైన ఆలయాల గోపురాల మధ్యగా అడివి అత్తిమొక్కలు ఏపుగా పెరుగుతున్నాయి.

మర్కటులు దాన్ని తమ సొంత నగ రంగా భావించి, అరణ్యంలో నివసించే ప్రాణులను నిరసనగా చూసేవాళ్ళు. కాని



వాళ్ళకు ఆ ఇళ్ళు ఎందుకు కట్టినవో, వాటిని ఎలా వాడుకోవాలో తెలీదు. వాళ్ళు రాజుగారి దర్బారు భవనంలో గుండ్రగా కూచుని, శరీరాలు గోక్కుంటూ, తాము మనుషులమన్నట్టు నటించేవాళ్ళు. లేక పోతే, కప్పులు లేని ఇళ్ళలోకీ, బయటికీ పరిగెత్తుతూ, రాళ్ళూ రప్పలూ ఏరి, ఒక మూల భద్రం చేసి, వాటిని ఎక్కడ దాచుకున్నదీ మరిచిపోయేవాళ్ళు. తమలో తాము పోట్లాడుకుని కేకలు పెట్టి, దొమ్మి చేసుకుని, రాజుగారి ఉద్యానంలోకి పరిగెత్తి, అక్కడి చెట్లను ఊపి, పూలూ కాయలూ రాల్చి, ఆనందించేవాళ్ళు. రాజభవనంలోని చీకటి కోణాలూ, చీకటి నడవలూ వెతుకుతూ తిరిగేవాళ్ళు. కాని తాము చూసినదేమిటో వాళ్ళకు గుర్తుండేది కాదు. "మనం అచ్చు మనుషులల్లేనే జీవిస్తున్నాం కాదూ?" అని ఒకరినొకరు ప్రశ్నించుకునేవాళ్ళు. మడుగుల్లో నీళ్లు తాగి, నీటిని కెలికి, తమలో తాము చచ్చేట్టు పోట్లాడుకుని, మందలు మందలుగా పరిగెత్తుతూ, "మర్కటులంత వివేకమూ, మంచితనమూ, తెలివీ, బలమూ, మర్యాదా గల వాళ్లు అరణ్యంలో ఎవరూ లేరు," అని కేకలు పెట్టేవాళ్ళు. చిట్టచివరకు నగర జీవితం విసుగెత్తినప్పుడు వాళ్లు అరణ్యంలో చెట్ల మీదికి వెళ్ళి, అరణ్యవాసుల దృష్టి ఆకర్షించటానికి నానా అగచాట్లూ పడేవాళ్లు.

అరణ్య సంప్రదాయాలు తెలుసుకున్న మౌగ్లీకి ఇదేం జీవితమో అర్థం కాలేదు, నచ్చలేదు కూడా. పొద్దువాలే సమయానికి మర్కటులు మౌగ్లీని శిథిలాలకు చేర్చి, దీర్ఘ ప్రయాణం అనంతరం అతణ్ణి అలవాటు ప్రకారం నిద్ర అయినా పోనివ్వకుండా, చుట్టూ వలయంగా నిలబడి, చేతులు చేతులు పట్టుకుని పిచ్చి పాటలు పాడుతూ నృత్యం చేశారు. ఒక మర్కటుడు ఉపన్యాసం ఇచ్చాడు; మౌగ్లీని

పట్టుకు రావటం మర్కట చరిత్రలో ఒక సువర్ణ ఘట్టమన్నాడు; మౌగ్లీ తమకు కర్రలతోనూ, తడపలతోనూ చాప అల్లటం నేర్పుతాడనీ, అందువల్ల తమకు వర్షం నుంచి రక్షణ ఉంటుందనీ తెలిపాడు.

మౌగ్లీ కొన్ని లతలు తెచ్చి అల్లటం ఎలాగో చూపాడు. మర్కటులు కొంత సేపు తాము కూడా అతనిలాగే చేయ యత్నించారు. కాని వాళ్ళకు త్వరలోనే విసుగెత్తింది. ఆ తరవాత వాళ్ళు ఒకరి తోకలు ఒకరు లాగటమూ, "ఖో, ఖో!" అని అరుస్తూ నాలుగు కాళ్ళ మీద ఎగరటమూ ప్రారంభించారు.

"నాకు ఆకలిగా ఉన్నది. నా కీ ప్రాంతపు అరణ్యం తెలియదు. నాకు తిండి తీసుకు రండి, లేదా ఇక్కడ వేటాడటానికి అనుమతి అయినా ఇవ్వండి," అన్నాడు మౌగ్లీ.

అతనికి కాయలూ, పళ్ళూ తీసుకు రావటానికి ఇరవై, ముప్ఫై మంది మర్కటులు బయలుదేరారు. అయితే దారిలో వాళ్ళు యుద్ధం ఆరంభించి, తెచ్చే పళ్ళు పూర్తిగా ధ్వంసం చేశారు.

మౌగ్లీకి ఆకలితోపాటు ఆగ్రహం కూడా దహించుకు పోతున్నది. అతను వేటనినాదాలిస్తూ ఆ శిథిల నగరం అంతా తిరిగాడు. కాని అతని కేకలకు ఎలాటి జవాబూ రాలేదు.



"ఇంత పాపిష్టి చోటు ఎక్కడా ఉండదు. మర్కటులను గురించి భాలూ చెప్పిన దంతా అక్షరాలా నిజం. వీళ్ళకొక సంప్రదాయం లేదు, వేట పిలుపులు లేవు. నాయకత్వం లేదు. అర్థం లేని మాటలూ, దొంగ బుద్ధులూ వీళ్ళూనూ! నే నిక్కడ తిండికి మాడినా, హత్య అయినా తప్పంతా నాదే.. ఎలాగైనా అరణ్యానికి తిరిగి పోగలిగితే బాగుండును—భాలూ చేత దెబ్బలు పడితే పడతానుగాక!" అనుకున్నాడు మౌగ్లీ.

అతను ప్రాకారం దాకా వెళ్లాడో లేదో, మర్కటులు అతన్ని పట్టుకుని వెనక్కులా క్కొచ్చి, "నీ సుఖం కూడా నీకు తెలీదేం?" అంటూ గిచ్చారు. మౌగ్లీ పళ్ళ బిగువున సహించాడు.

రాజసౌధం ఆవరణలో చలవరాతి మండపం ఒకటి ఉన్నది. నూరేళ్ళ క్రితం అంతఃపుర స్త్రీలు నేల అడుగున ఉన్న సొరంగం కుండా అక్కడికి వచ్చి వెన్నెల విహారాలు చేసేవారు. మండపం చుట్టూ చిత్రపు పని చేసి రత్నాలు తాపిన చలువ రాతి పలకలుండేవి. వాటి సందులలో నుంచి వెన్నెల లోపలికి వచ్చేది. ఇప్పుడు ఆ మండపం కప్పు సగం కూలి, సొరంగ ద్వారాన్ని మూసేసింది. మర్కటులు మౌగ్లీని ఇక్కడి మిద్దె మీదికి తెచ్చి, అతని చుట్టూ మూగి, "మే మెంత గొప్పవాళ్లం! ఎంత జ్ఞానులం! ఎంత బలవంతులం! ఎంత మంచివాళ్ళం! మా నుంచి పారిపోతావే! మా సంగతి నువ్వు అరణ్యంలో అందరికీ చెప్పాలి," అని కోలాహలంగా మాట్లాడారు.

"నిశ్చయంగా వీళ్ళను పిచ్చి నక్కకరిచినట్టున్నది. వీళ్ళకు పిచ్చే, సందేహం లేదు. అదుగో చంద్రుడికి చిన్న మేఘం అడ్డొస్తున్నది. అదే మరింత పెద్ద మేఘమైతే హాయిగా తప్పించుకు పోదును గదా!" అనుకున్నాడు మౌగ్లీ. —(ఇంకావుంది)



# 73. "నాగపురం"

ఉత్తర అమెరికాలోని ఆరిజోనా ఎడారి మధ్య క్రీస్తుకు పూర్వం మూడు శతాబ్దుల కిందటి నుంచి హెూహెూకామ్ అనే జాతికి చెందినవారు గిలానది ప్రాంతంలో నివాసం ఏర్పరచుకుని, "నాగపురం" ఏర్పాటు చేసి, అక్కడే 1200 ఏళ్ళపాటు జీవించి, నామరూపాలు లేకుండా పోయారు. వీరు రాతి పరికరాలతోనే ఒక నాగరికతను సృష్టించుకున్నారు. నీటి పారుదలకు గాను కాలువలు తవ్వి పంటలు పండించారు. ఈ ప్రాంతంలో ఈ జాతికి చెందిన శిల్పాలు అనేకంగా యిటీవలనే లభ్యమయినాయి.



Photo by Vimalanand P. Shirali



బహుమతి
పొందిన వ్యాఖ్య

చూడమని న న్నడగవలెనా?

పంపినవారు:
కిష్టాగౌడు, నిజామాబాద్

Photo by M. A. Mohan Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

చూడనిస్తే చూడనా!

పంపినవారు :
కిష్టాగౌడు, నిజామాబాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చూడమని సన్నడగవలెనా?

రెండవ ఫోటో : చూడనిస్తే చూడనా!

పంపినవారు : కిష్టాగౌడు,

గవర్నమెంట్ గిరిరాజకళాశాల, నిజమాబాద్.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# దిలీప్ బృందం
## ఎగిరిపోయిన రామచిలుకను పట్టుకున్నారు

కీచు కీచు టపటప






















HWTUC 1974

క్యాడ్‌బరీస్ **అద్భుతలోకం** నం. 5



నక్షత్రచేప చేయిపోగొట్టుకొంటే, మళ్ళీ పదిరోజులలోపల ఇంకొక చేయి పెరుగుతుంది! చేపను ఐదు భాగాలుగా నరికిన ఒకొక్క భాగం మీద క్రొత్త అంగాలు పెరుగుతాయి. అప్పుడు ఒక్క చేపకుబదులు ఐదు నక్షత్రపు చేపలు ఉద్భవిస్తాయి!



కొన్ని సార్లు వర్షం పడినప్పుడు కప్పలు, చేపలు వర్షంలో పడుతుంటాయి! ఇది ఎట్లా సాధ్యమంటే, తేలికగ ఉండే కప్పగ్రుడ్లు సుడిగాలుల ద్వారా పైకి కొనిపోబడతాయి. గ్రుడ్లు పగిలి పిల్లలైనప్పుడు బరువెక్కి భూమిమీద వర్షిస్తాయి. అదే విధంగా, నీటియూటల ద్వారా ప్రక్క ప్రాంతాలకు కొనిపోబడతాయి!

బోస్టన్ నగరములో 1919 వ యేట సిరపు వెల్లువవచ్చింది. నగరంలో ఒక బట్టీకిచెందిన, సిరంతోనిండిన తటాకమొకటి తెగి, ఆ నీరు నగరమంతా మూడడుగుల దళసరంగా పారింది. వంతెనలు, కట్టడాలు పడిపోయినాయి. జిగటజిగటగానున్న ఆ గందరగోళాన్నంతా శుభ్రం చేసేటప్పటికి ఐదేళ్లు పట్టింది. ఆ తరువాత, అనేక సంవత్సరాలవరకు సిరపు వాసన నిలిచియుండిందట!





కొలంబస్ అమెరికాను కనుగొనకముందు అనేక శతాబ్దములకు పూర్వమునుండే రెడ్ ఇండియనులు కోకో పండిస్తుండేవారు. ఆరోజుల్లో కోకో గింజలు డబ్బు రూపంగా వారిచేత వాడబడుతుండేవి. ఐశ్వర్యవంతులు మాత్రమే ఆ గింజలను ఆహార పానీయంలోనికి వాడుకోడానికి సాధ్య పడుతుండేది. ఈరోజు కోకోతో చేసిన చాకొలేటులు ప్రపంచమంతట జనప్రియమైనవి. అంతేకాదు క్యాడ్‌బరిస్ వారు చేసిన మిల్క్ చాకొలేటు ప్రతి తునకలో పాలయొక్క శ్రేష్ఠత అంతా కూర్చబడింది.




## మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్

C. 18 TL




Every father wishes a bright future for his children, but mere wishful thinking does not help. SAVING DOES.

You are welcome to Open your Savings Account with us.



**INTEREST 4%**

**Unlimited number of withdrawal facility.**

**Other Savings programmes are:**

**FIXED DEPOSITS - Interest upto 7-5/8%**
**and RECURRING DEPOSITS.**

# THE ANDHRA BANK LIMITED

**(The Bank for Friendly Service)**

**Regd. Office: Machilipatnam-Central Office: Hyderabad.**




**K. S. DUTT**
Chairman

**T. R. BHAGAVAT**
General Manager






Double Packed
for Freshness
and Flavour

SALTO

**Finest Biscuits you ever tasted**

Foil wrapped
for Freshness
and Flavour




**J.B.MANGHARAM&CO.**

GWALIOR (*India*)

